# కామశాస్త్రం విశేషాలు

## HEALTHY SEX, SAFE SEX & SEXUAL POTENTIALITY

As told by :

*Great Indian Sages*

iii

# విషయసూచిక

V

## "ధర్మార్థ కామేభ్యోనమః"

ధర్మానికి నమస్కరిస్తున్నాను. డబ్బుకు నమస్కరిస్తున్నాను. కామానికి నమస్కరిస్తున్నాను.

ఇష్టదైవానికి నమస్కరిస్తారు ఎవరైనా.....? ఇదేమిటీ.....? ఈ వాత్స్యాయనుడు ఇలా మొదలు పెడ్తున్నాడు.....??

మనం ఏ విషయం గురించి మాట్లాడుకొంటున్నామో దానిమీద మీకైనా, నాకైనా సరే గౌరవం వున్నప్పుడే మనం మాట్లాడుకున్న ప్రయోజనం వుంటుంది. క్రొత్త విషయాలు తెలుస్తాయి. కొత్తగా ఆలోచించడం తెలుస్తుంది.

ఇప్పుడు మనం కేవలం ధర్మార్థకామాల గురించి మాత్రమే మాట్లాడుకోబోతున్నాం కాబట్టి ఆ మూడింటిమీద గౌరవంతో నమస్కరించాడు మహర్షి !

ధర్మార్థకామాలు ఈ శాస్త్రానికి 'ప్రకృతి' (స్వభావం - Nature) కాబట్టి వాటికి నమస్కారం. వాటిని ఉపదేశించే బోధకులకి, శాస్త్ర కర్తలైన ఆచార్యులకి, పండితులకి, కామశాస్త్ర పారంగతులక్కూడా నమస్కారం. ఎందుకంటే, అలాంటి అనుభవజ్ఞుల అనుభవాన్ని కూడా ఈ శాస్త్రంలో మనం ఉపయోగించుకోబోతున్నాం, కాబట్టి వారికీ నమస్సులు. వారి అనుభవాలు మనకి ఆరోగ్యవంతమైన శృంగారాన్ని, సురక్షితమైన శృంగారాన్ని, సమర్థవంతమైన శృంగారాన్ని ఇచ్చేవిగా ఉండాలని కోరుకుందాం.

## —— మొట్టమొదటి కామశాస్త్రం ——

ఇప్పుడే మీకో విషయం చెప్పాలి. ఈ కామశాస్త్రం ఇవ్వాళ ఏదో కొత్తగా పుట్టుకురాలేదు. ప్రజలందరినీ సృష్టించే క్రమంలో బ్రహ్మదేవుడు ఎంతో పనివత్తిడి మీద వున్న రోజుల్లోనే, ధర్మార్థకామాలనే పురుషార్థాలను సాధించుకోవడానికి కావలసిన ఉపాయాలెన్నో చెబుతూ 'స్థితి నిబంధనం' అనే శాస్త్రాన్ని తయారుచేశాడు.

స్థితి నిబంధనం మూడు భాగాలుగా ఉంది.

మొదటిభాగం ధర్మం గురించి చెబుతుంది. దాన్ని మనువు ప్రజలందరికి తెలియజేస్తానని బ్రహ్మనుంచి గ్రహించాడు. రెండో భాగం డబ్బుగురించి చెబుతుంది. దేవతల గురువు బృహస్పతి దీన్ని తాను వివరిస్తానని బ్రహ్మనుంచి గ్రహించాడు. ఇంక మూడోది, అతి ముఖ్యమైనది కామశాస్త్రం. నందికేశుడు దీన్ని గ్రహించి, వెయ్యి అధ్యాయాలు కల్గిన శాస్త్రంగా తయారుచేశాడు. ఇది మొట్టమొదటి కామశాస్త్ర గ్రంథం.

## —— త్రేతాయుగానికి లైంగిక నీతి ——

వెయ్యి అధ్యాయాలున్న ఇంత పుస్తకం మరీ పండితులకు తప్ప సామాన్య జనానికి ఎక్కువగా వున్నదని, నందికేశ్వరుడు రూపొందించిన కామశాస్త్రాన్ని సంక్షిప్తీకరించి 500 అధ్యాయాలతో కొంచెం క్లుప్తంగా మరో గ్రంథాన్ని రూపొందించాడు శ్వేతకేతువు. ఈయన ఉద్దాలక మహర్షి పుత్రుడు. ఆరోజుల్లో ఇంటికొచ్చిన అతిథిని గౌరవించడంకోసం స్వంత భార్యని ఆయనదగ్గరకు పంపడం వంటి కొన్ని దురాచారా లుండేవి. శ్వేతకేతువు వాటినన్నింటినీ ఖండించి, 'లైంగిక నీతి' ఎలావుండాలో చక్కగా బోధించాడు ఈ గ్రంథంలో. అది త్రేతాయుగంనాటి ప్రజలకోసం రాసిన గ్రంథం.

## —— ద్వాపరయుగంలో కామశాస్త్రం ——

మళ్ళీ యుగం మారింది. మనుషుల్లో పెద్దపెద్ద తలగడల్లాంటి గ్రంథాలు చదువుకునే ఓపికలు తగ్గిపోసాగాయి. అందుకని బాభ్రవ్యుడనే మహర్షి పూనుకొని 150 అధ్యాయాలతో బాగా క్లుప్తీకరించిన కామశాస్త్రం గ్రంథాన్ని రచించాడు. అది ద్వాపరయుగం నాటి ప్రజలకోసం ఉద్దేశించింది.

ఈ గ్రంథంలో "వైశికం" అనే అధ్యాయం ఉందిట. ఆ అధ్యాయం వరకూ తీసుకొని పాటలీపుత్రంలో వున్న వేశ్యల ఉపయోగార్థం మరింత విస్తృతపరచి, దత్తకుడనే రచయిత ఒక చిన్న గ్రంథాన్ని ప్రత్యేకంగా తయారుచేశాడట. వ్యభిచారంచేసే స్త్రీలు

విటులతో ఎలా ప్రవర్తించాలో విడమరిచిన అధ్యాయం అది! ఆరోగ్యవంతమై, సురక్షితమైన శృంగారానికి వేశ్యల వలన కలిగే అపకారం ఆ యుగంలోకన్నా ఈ యుగంలో ఎక్కువ కాబట్టి దాని ప్రస్తావనని వదిలేయడమే మంచిది! ఈ దత్తకుడి గురించి ఒక చక్కని కథవుంది. సరదాగా వుంటుంది. చదవండి.

పాటలీపుత్రంలో ఓ వృద్ధ బ్రాహ్మణుడికి ఒక కొడుకు పుట్టాడు. కొడుకును కని తల్లి చనిపోయింది. అనతి కాలంలోనే తండ్రికూడా మంచానపడి, పిల్లవాణ్ణి పెంచేబాధ్యత ఇంకో ఆవిడకి అప్పగించి కాలంచేసేశాడు. వాడికి దత్తకుడని పేరుపెట్టి ముద్దుగా పెంచుకోవడం మొదలుపెట్టింది ఆ ఇల్లాలు. దత్తకుడు వేదవేదాంగాలతో పాటు సకల కళల్లోనూ ఆరితేరాడు. మంచి వక్త. మంచి గ్రంథసాంగుడుకూడా! పాటలీపుత్రం వేశ్యల దగ్గర "లోకయాత్ర" అనే విద్యకు సంబంధించిన రహస్యాలేవో ఉన్నాయని తెలిసి, వాళ్ళని మంచిచేసుకుని, అవి తెలుసుకొని, పరిశోధించి, అందులోని రహస్యాల్ని తిరిగి వాళ్ళకే నేర్పాడట. స్త్రీ రూపం పొంది పురుషుడితో కలిగే సుఖాన్ని, పురుషరూపంలో స్త్రీతో కలిగే సుఖాన్ని రెండింటినీ అనుభవ పూర్వకంగా తెలుసుకున్నాడట. తన అనుభవాల్ని జోడించి పురుషుల్ని రంజింపచేసే ఉపాయాల్ని స్త్రీలకు బోధించడం కోసం 'వైశికం' గ్రంథాన్ని విస్తరించి రాశాడట.

ఇలాగే చారాయణుడు, సువర్ణనాభుడు, ఘోటకముఖుడు, గోనర్దీయుడు, గోణికా పుత్రుడు, కుచుమారుడు ..... ఇలా చాలామంది కామశాస్త్రంలోంచి తలాఒక అధ్యాయాన్ని బాగా విస్తరించి విడివిడిగా గ్రంథాలు రాశారు. ఇంక కలియుగం ప్రవేశించింది.

## సులువైన రీతిలో కామశాస్త్రం - మీకోసం

మూలగ్రంథం నందికేశ్వరుడి రచన. తర్వాత రచయితలంతా దాన్ని సులభతరం చెయ్యాలని మొదలుపెట్టి, చివరికి ఒక్కొక్క అధ్యాయాన్ని ఒక్కొక్క ఉద్గ్రంథంగా తయారుచేశారు. అందుకని వాత్స్యాయనుడు పూనుకొని, "సంక్షిప్య సర్వమర్థ మవ్వేన గ్రంథేన కామసూత్రమిదం ప్రణీతవాన్" అంటూ, కామశాస్త్రంలో ఉన్న సమస్త విషయాల్నీ సంగ్రహరూపంలో ఈ పుస్తకం ద్వారా చెబుతున్నాను అన్నాడు వాత్స్యాయనుడు.

ఈ పుస్తకం మీద చాలామంది పండితులు వ్యాఖ్యానాలు రాశారు. మానవుణ్ణి సన్మార్గంలో నడపడం ఈ శాస్త్రం లక్ష్యం. దీన్ని సాధ్యమైనంత సరళతరంగా, అత్యంత సామాన్య పాఠకుడు కూడా తేలికగా అర్థంచేసుకోగలిగేలా వ్యాఖ్యానించడం ఇప్పుడు మీ చేతుల్లోనే వున్న ఈ పుస్తకం ఆశిస్తున్న ప్రయోజనం. అందుకే, విశేషాలను మాత్రమే ఏరి ఈ పుస్తకాన్ని అందిస్తున్నాము.

మళ్లీ మొదటికొస్తున్నాం. త్రివర్గాల గురించి చెబుతున్నాడు వాత్స్యాయనుడు. త్రివర్గాలంటే “ధర్మార్థకామాలే” !! ఇవన్నీ మామూలేకదా అని పేజీలు తిప్పకండి. ఇందులో మిమ్మల్ని ఆలోచింపచేసే విషయాలు కొన్ని వున్నాయి. అవి -

1. తెలుసుకోవడం (అవబోధం)
2. ఆచరించడం (అనుష్ఠానం)
3. ఫలితాన్ని అనుభవించడం (సంప్రతిపత్తి)

ధర్మార్థకామాల్ని అనుభవంలోకి తెచ్చుకోవడానికి ఈ మూడు మార్గాలున్నాయి.

వీటిని సేవించడానికి పండితులు “వయస్సు” కొలతలు చెప్తారు. బాల్యం, యవ్వనం, వార్ధక్యం అని! కానీ, కామశాస్త్రం దీన్ని ఇంకోలా చెబుతుంది.

శాస్త్రంలో చెప్పింది తెలుసుకొనే వయస్సు బాల్యం. తెలుసుకున్నది ఆచరించే వయస్సు యవ్వనం. ఆచరించిన దాని ఫలితాలు అనుభవించేది వార్ధక్యం.

ఆయుష్షు స్థిరమైంది కాదు కాబట్టి, ప్రతివాళ్ళూ నిండునూరేళ్ళూ బతకడం సాధ్యంకాదు కాబట్టి, ధర్మార్థాల్నికూడా మొదటినుండి చివరివరకూ దృష్టిలో పెట్టుకొని కామాన్ని సేవించ మంటుంది శాస్త్రం. యవ్వన వార్ధక్యాలు కామసేవనకోసం ఉద్దేశించినవే !

చెప్పింది తెలుసుకునే బాల్యంలో మాత్రం ‘కామసేవన’ వద్దు - బ్రహ్మచర్యం పాటించమంటుంది కామశాస్త్రం.

## ‘కామం’ అంటే ఏమిటి ?

ఇప్పుడు మీరు కామశాస్త్రం చదవబోతున్నారుకదా..... ముందుగా కామం అంటే ఏమిటో చెప్తున్నాడు. ఇది చాలా ముఖ్యమైన నిర్వచనం. కొంచెం శ్రద్ధగా చదవండి.

కళ్ళు ఈ ప్రపంచాన్ని చూపిస్తున్నాయి. చెవులు విన్పింపచేస్తున్నాయి. నాలుక రుచిని తెలిసేలా చేస్తోంది. ముక్కు వాసన తెలిసేలా చేస్తోంది. చర్మం స్పర్శని తెలుపుతోంది. ఇలా మన పంచ జ్ఞానేంద్రియాలు మన మనసు పరిపాలనలో వుండి మన శరీరానికి అనుకూలంగా ప్రవర్తించడాన్ని ‘కామం’ అంటారని కామశాస్త్రం నిర్వచిస్తోంది.

అంటే అర్థం అయ్యిందా ? కాకపోతే మరొక్కసారి చదవండి.

ఆత్మ అంటే జీవుడు. ఈయన కంటితో ఒక విషయాన్ని చూసి ఆనందిస్తున్నాడు - అనుకుందాం !

ఇక్కడ ఆనందించింది జీవుడు. ఆనందం పొందేలా చేసింది మనసు. ఆనందం కల్గించింది వస్తువు. అందుకు తోడ్పడింది కన్ను. కన్ను అనే జ్ఞానేంద్రియంతో చూడడం అనే ఇంద్రియార్థం ద్వారా మనసులో సంతోషాన్ని ఆత్మ పొందుతోంది. ఆత్మ, మనసు,

ఇంద్రియం, ఇంద్రియార్థాల సంయోగం అనుకూలంగా వున్నప్పుడు అది'కామం' అవుతుంది. ఇది సామాన్య కామం. ఫ్రాయిడ్ మనోవిశ్లేషణ సిద్ధాంతం ప్రకారం ఇదికూడా 'సెక్సు'గానే పరిగణించబడుతుంది.

ఇంకో కామం ఉంది. అది విశేష కామం. స్త్రీ పురుషులు ఒంటరిగా దగ్గరయినప్పుడు పొందిన ఆనందాన్ని విశేషకామం అంటారు. దీన్ని 'ఆభిమానిక సుఖం' అనికూడా అంటారు. అవతలి వ్యక్తిద్వారా తాను ఫలానా సుఖానుభవాన్ని పొందుతున్నానని, ఇద్దరూ ఒకరినొకరు అభిమానించుకొనే సుఖాన్ని విశేషకామం అంటారు. ఇతర కోరికలూ తీరాలి – సెక్సుకోరికా తీరాలి – అని విడివిడిగా చెప్తున్నాడన్న మాట.

## ——— ధర్మార్థకామాలలో ఏది ముందు ? ———

ధర్మార్థకామాలు మూడూ ఒక్కసారే సమకూరాయి అనుకుందాం. వీటిలో ముందు దేన్ని సాధించాలి అనేది ప్రశ్న. ఎవరైనా తడుముకోకుండా ధర్మం ముందు, అర్థం తర్వాత, ఆఖరికి అన్ని అవకాశాలూ కలిసొస్తే అప్పుడు కామం ..... అంటారు కదా ! ఇది నిజమే ! కామంకన్నా అర్థం గొప్పది. అర్థం కన్నా ధర్మం గొప్పది.

కానీ, ఇది మనుషులందరికీ సమానంగా వర్తించే విషయమేనా? ఒక్కసారి ఆలోచించండి.....!! వాత్స్యాయనుడు ఏమంటాడో తెలుసా..... "అర్థశ్యరాజ్ఞః" అని ! రాజుకి ధర్మం కన్నా, కామం కన్నా, డబ్బు ముఖ్యం అని దీని అర్థం. లోక సంరక్షణ చెయ్యాలంటే కోశం బలంగా ఉండాలి. దండబలం (సైనిక శక్తి) మెండుగా ఉండాలి. అందుకు 'అర్థం' (డబ్బు) ముఖ్యం కదా ! రాజుదాకా దేనికీ..... వేశ్యను తీసుకోండి – దానికి ధర్మకామాల కన్నా డబ్బు ముఖ్యంకదా..... అందుకని ధర్మార్థకామాలలో ఏది ముఖ్యం అనేది అవి అందుబాటులోకి వచ్చి, సమకూరిన పరిస్థితి మీద, వాటి అవసరం మీద, అవకాశం మీద ఆధారపడిన అంశాలేగాని అందరినీ అన్నివేళలా ఒక గాటన కట్టిపడేయడం సాధ్యం కాదంటుంది కామశాస్త్రం ! కొందరికి ధర్మమే ముఖ్యం. కొందరికి కొన్ని పరిస్థితుల్లో డబ్బు ముఖ్యం ! ఎక్కువ మందికి అన్ని పరిస్థితుల్లోనూ కామమే ముఖ్యం.

## ——— కామానికి శాస్త్రం అవసరమా ? ———

ఆవులూ, ఎద్దులూ కలుసుకొంటున్నాయి. చేపలూ, చేపలూ కలుసుకొంటున్నాయి. స్త్రీ, పురుష భేదం ఉన్న ప్రాణికోటిమొత్తం సంయోగ సుఖాన్ని పొందుతూనే ఉంది. ఇవన్నీ ఏ శాస్త్రంలో చదివి కామసేవన చేస్తున్నాయంటారూ.....??

సృష్టి ఏర్పడినప్పుడే ఆత్మతోపాటే మనసు, కామక్రోధాదులు అన్నీ ఏర్పడ్డాయి. కామంకోసం ఒక శాస్త్రం కొత్తగా కావాలా ?

దీనికి సమాధానం వాత్స్యాయనుడే స్వయంగా చెప్పాడు. "సాచోపాయ ప్రతిపత్తిః కామసూత్రాదితి వాత్స్యాయనః" సుఖాన్ని సమృద్ధిగా పొందే ఉపాయం కామసూత్రం వలన లభ్యం అవుతుంది కాబట్టి వాత్సాయనుడు కామసూత్రాలు తెలుసుకోమంటున్నాడు.

'వాత్స్యాయన' పదం ఆయన గోత్రం. ఆయన అసలు పేరు మల్లనాగుడు అంటారు.

సరే, ఇక్కడ కొన్ని చిన్నచిన్న సూక్ష్మాలు ఉన్నాయి..... సరదాగా పరిశీలించండి !

1) పశువులూ, పక్షులూ తమ మానాన్ని బట్టతో కప్పిఉంచుకోవట్లేదు. మనిషి మాత్రమే అలా చేస్తున్నాడు. అందువలన 'సిగ్గు' అనేది మనిషికి తెలిసినట్లు పశుపక్ష్యాదులకు తెలియదు.

2) పశుపక్ష్యాదుల్లో ఎక్కువ జాతులు ఋతుకాలంలో మాత్రమే సంయోగ సుఖాన్ని పొందుతున్నాయి. అదికూడా సంతాన ప్రాప్తిని కల్గించేదే అయినా, కోరిక మేరకే సంగమిస్తున్నాయిగాని, సంతానాన్ని కనాలనే స్పృహతో కాదు.

3) మానవ స్త్రీలలో ఋతుకాలం నెలకొకసారి వుంటుంది. అత్యధిక జీవరాసుల్లో మాత్రం ఎప్పటికో ఒకసారి ఉంటుంది. ఋతువు లేనప్పుడు జంతు ప్రాణులు సంయోగ సుఖాన్ని కోరుకోవడంలేదు. ఋతుకాలంతో నిమిత్తంలేకుండా మనుషులు నిరంతరం "సెక్సుయావ"లోనే జీవిస్తున్నారు. కాబట్టి వాళ్ళకి ధర్మార్థకామ భావన కావాలి. పశువులకు అవసరం లేదు.

4) పశువులు క్షీరధారలిస్తున్నాయి. పక్షులు గుడ్లు ఇస్తున్నాయి. అంతే కాక ఆహారానికి మాంసాన్నిస్తున్నాయి. అందుకోసం తమ సంతతిని వృద్ధిచేసుకుంటున్నాయి. కానీ, ఇవి ఏవీ బుద్ధిపూర్వకంగా "ఇవ్వాళ మన అయ్యగారికి పది లీటర్ల పాలు ఇవ్వాలి" అనుకొని అవి మనకు ఇవ్వడం లేదు. రోజుకొక గుడ్డు జాగ్రత్తగా పెట్టి తన యజమానికి అప్పగించాలని ఏ కోడీ కోరుకోదు. కాబట్టి ధర్మార్థకామాల సాధన అనే ప్రస్తావన పశుపక్ష్యాదులకు ఉండదు. మనుషులకు కావాలి.

5) మనుషులు సిగ్గు తెలుసుకొని తమ తమ మానాల్ని గుడ్డలతోనో, ఆకులతోనో, జంతుచర్మాలతోనో కప్పుకోవడం మొదలుపెట్టిన రోజే ధర్మార్థకామాలు కూడా మానవజాతిలో మొదలయ్యాయి. అవి అవసరం. వాటికి శాస్త్రాలుకూడా అవసరమే!

## —— అందినచోట అందినంత అందినప్పుడే...!! ——

యజ్ఞాలు చేస్తే వచ్చే జన్మలో ఫలితం కనిపిస్తుందిట! ఇన్ని కష్టాలూ సహించి అన్ని కోర్కెలూ చంపుకొని చచ్చిన తర్వాత ఏమౌతామో ఎవరికీ తెలియదు. తెలివైనవాడు చేతికి చిక్కినదాన్ని వదిలి వచ్చే జన్మలో ఈ సుఖాన్ని అనుభవిస్తాను..... అంటాడా???

రేపు దొరికే నెమలి కంటే, ఇవ్వాళ దొరికిన పావురం మేలు కదా! వెనకటికి ఇలానే ఓ పెద్దాయన చందాకోసం వచ్చాడు. సదరు దాతగారు అన్నాడు కదా....."ఇప్పుడు చేతిలో పెద్దగా డబ్బులేదు. పాతికో పరకో ఇవ్వగలను. రేపు డబ్బు వస్తుంది. రేపు వస్తే ఇంకాస్త ఎక్కువిస్తాను" అని ! అది విని, చందాలాయన నవ్వి, రేపు వస్తుందనుకున్న డబ్బుమూట సంశయాత్మకం కదా..... ఇప్పుడు తమ చేతుల్లో ఉన్నదంటున్నదేదో అదే నిజం..... కాబట్టి, ఆ నిజమేదో దాన్నే దయచేయించండి..... అన్నాడట. అలాగే కామం కూడా అంతే. రేపటికి వాయిదా వేసే విశేషాలు కావివి. అయితే, ఆ అందిన కామం ఆరోగ్యవంతంగానూ, సురక్షితంగానూ ఉండేలా జాగ్రత్తపడాలి. అదీ సంగతి !

## —— విత్తనాల్ని త్యాగం చేస్తేనే మొక్కలు మొలుస్తాయి ——

శాస్త్రంమీద చిన్నచూపుతో ఇలాంటి కథలు చాలామంది చాలానే సృష్టించారు. వాత్స్యాయనుడు ధర్మం లేని కామాన్ని అంగీకరించడు. ఆయనేమీ బహిరంగ వ్యభిచారాన్ని, నీతిమాలిన సెక్సు వ్యవహారాన్ని ప్రోత్సహించడానికి ఈ పుస్తకాన్ని రాయలేదు. ఆయన ఒక్కటే ప్రశ్న అడుగుతున్నాడు.....

చేతిలో వున్న ధాన్యపు విత్తనాన్ని వండుకొని తినొచ్చు కదా..... కానీ, రేపటి పంటకోసం నేలలోనాటి దాన్ని త్యాగం చేస్తున్నాం కదా..... అలాగే, ముందు కలగబోయే ఫలితాలకోసం ఈ రోజునుంచే ధర్మాన్ని అనుసరించి నీ ధర్మాన్ని నువు పాటించు..... అన్నాడు.

పదవులు, అధికారాలు సంపదలు వస్తూవుంటాయి. ఒక్కోసారి అప్రయత్నంగా కూడా వస్తాయి. ఇంకోసారి ప్రయత్నించిన దానికన్నా ఎక్కువ వస్తాయి. చాలాసార్లు ఎంత ప్రయత్నించినా కన్పించవు. అలాగని పురుష ప్రయత్నం వదలకూడదు కదా..... ఉపాయం లేకుండా పురుష ప్రయత్నం ఎంతచేస్తే మాత్రం ఏమిటీ.....

## —— అతి కామం తెచ్చే అనర్థాలు ——

ధర్మార్థాల్ని పొందడానికి ప్రయోగించే ఉపాయాలకన్నా కామాన్ని అతిగా సాధించుకోవడానికి చేసే ఉపాయాలు అనర్థదాయకంగా ఉంటాయి. చెడుస్నేహాలు, చెడు ప్రయత్నాలకు అవకాశం కల్పిస్తాయి. అర్థరాత్రి పూట 'విటీ జనం' (వ్యభిచారం కోసం వచ్చేవాళ్ళు) కోసం వెంపర్లాడవలసి వస్తుంది.

మనిషిలోని నిర్మలత్వాన్ని, శుచినీ భస్మంచేస్తాయి. ప్రజ్ఞా ప్రాభవాల్ని తుడిచి పెడతాయి. "కామగార్ధభం" అంటే అడ్డగాడిదలాగా మనిషిని తయారుచేస్తాయి.

శరీరానికి ప్రమాదాల్ని పుట్టిస్తాయి. నలుగురిలో పలుచన అయ్యేలా చేస్తాయి. మన వెనకాల మనగురించి జనం చెవులు కొరుక్కునేలా చేస్తాయి. అందరూ తిరస్కరించే పరిస్థితి ఎదురౌతుంది.

కామానికి లొంగిపోయిన వ్యక్తి తను నశించి పోవడమేకాదు. తన మీద ఆధారపడిన తన కుటుంబం నాశనానిక్కూడా కారకుడౌతాడు. అందుకే ఆరోగ్యవంతమైన కామం, సురక్షిత కామం, సమర్థవంతమైన కామంకోసం ఈ గ్రంథాన్ని రూపొందించడం జరుగుతోంది!

## కామశాస్త్రం తెలీని కాముకులు నశించారు

భోజవంశంలో దండకుడనే రాజు ఒంటరిగా వున్న భార్గవ ముని కుమార్తెని ఎత్తుకుపోయాడు. సమిధలూ, దర్భలూ తెచ్చుకొని తిరిగొచ్చిన ముని జరిగిందంతా తెలుసుకొని రాజుని సకుటుంబ సపరివారంగా నశించిపొమ్మని శపించాడు. ఆచోటు ఇప్పటికీ దండకుడి పేరున దండకారణ్యంగానే పిలువబడుతోంది.

ఇంద్రుడు గౌతమ మహర్షి భార్యయైన అహల్యని కామించాడు. కామోపాయంతో అహల్యను లోబరచుకొన్నాడు. ఇంతలో గౌతముడొచ్చాడు. అహల్యకేం చెయ్యాలో తోచలేదు. ఇంద్రుణ్ణి సూక్ష్మరూపంలో తన గర్భంలో దాచేసింది. గౌతముడు హడావిడిగా వచ్చాడు. ఫలానా ముని మనల్ని తన ఆశ్రమానికి ఆహ్వానించాడు, త్వరగా వెడదాం



రమ్మన్నాడు. అహల్యకు తనలోపల దాచిన ఇంద్రుణ్ణి వదుల్చుకునే అవకాశం లేకుండా పోయింది. అలాగే, ఉన్నపళాన గౌతముడితో బయల్దేరింది. తీరా అక్కడకు వెళ్లాక, ఆతిథ్యం ఇస్తున్న ఆ మునికి విషయం అర్థం అయ్యింది. మూడు కుర్చీలు వేసి ఆహ్వానించాడు. ఇద్దరమే కదా వచ్చాం..... మూడు ఆసనాలు వేస్తాడేమిటా అని ఆలోచించాడు గౌతముడు. దివ్య దృష్టితో చూశాడు. విషయం అర్థమయ్యింది. చాలా అవమానం జరిగినట్లుగా భావించాడు. అహల్యని రాయి అయిపొమ్మని శపించాడు. ఆమె యోనిలో దాక్కున్న ఇంద్రుణ్ణి బైటకు పిలిచాడు. “ఇంద్రా! యోనిలో దాక్కున్నావా..... నీ వొళ్ళంతా యోనిలా అయిపోతుంది” అన్నాడు. అందుకే ఇంద్రుణ్ణి “సహస్ర భగుడు” అంటారు.

అలాగే, ద్రౌపదిని బలాత్కరించబోయిన కీచకుడు, ఇంకా చాలామంది కామ ప్రవృత్తి వలన నశించిపోయారు ఎందుకని..... ఎందుకంటే, వీళ్ళకి కామం మాత్రమే ఉంది. కామశాస్త్రం తెలియదు కాబట్టి.

## —— ఆహారంలాగానే కామాన్నీ సేవించాలి ——

ఆహారం ఏవిధంగా శరీరానికి సంతృప్తినిస్తోందో కామంకూడా అలానే శరీరానికి, మనస్సుకూ సంతృప్తినీ, సంతోషాన్ని కల్గిస్తోంది. ఆహారం శరీర ఆరోగ్యానికి ఉపయోగపడినట్లే కామంకూడా ఉపయోగపడ్తోంది. ఆహారాన్ని తీసుకోకపోతే శరీరం ఎలా కృశించి పోతుందో, కామసేవన చెయ్యకపోతే శారీరకంగా, మానసికంగా కూడా మనిషి కృశించిపోతాడు. కాబట్టి ఆహారాన్ని ఎలా సేవిస్తున్నామో అలాగే కామాన్నికూడా సేవించాలి.....

## —— అనర్థాలను పరిహరించి సుఖాలు పొందండి ——

ధర్మార్థాలుకూడా కామాన్ని ప్రసాదిస్తాయి. ఎలాగంటారా..... ధర్మంవలన స్వర్గం వస్తుంది అనేది నిజమే అయితే, ఆ స్వర్గంలో ఉత్తమ స్త్రీలలో దొరికేది కామమే కదా. అలాగన్నమాట!

“బాగానే ఉంది! ఇలా అయితే, కామం సేవించడానికి ఇంకా అడ్డం ఏముందీ..... ఎవరికి వాళ్ళు యథేచ్ఛగా వ్యవహరించవచ్చు గదా.....” అని మీరు అడగవచ్చు. దానికి వాత్స్యాయనుడు చెప్పిన సమాధానం ఇది..... ఆహారం బావుంది కదా అని అతిగా తింటే ఏమౌతుంది ? ఎక్కడపడితే అక్కడ, ఎలాంటిది దొరికితే అలాంటిది తింటే పొట్టగతి ఏమిటీ.....? కామంకూడా అంతే ! అలాంటి దోషాలను

నివారించుకొంటూ కామాన్ని సేవించాలి. అడుక్కునేవాళ్ళు వస్తున్నారని మనం వంటచేసుకోవడం మానుకోం కదా..... అడవి జంతువులు తిరుగుతున్నాయని పంటలు వెయ్యకుండా ఉండంకదా..... సుఖాన్ని ద్వేషించే వాడి జన్మ వృథా. ప్రతీ సుఖం వెనక కొన్ని అనర్థాలుంటాయి. వాటిని పరిహరించుకొని మనం సుఖానుభవాన్ని పొందవలసి ఉంటుంది.

ఏ పనినిచేస్తే అర్థకామాలకు ఎలాంటి ప్రమాదం కలగదో..... ఏది చేసినందువలన సుఖానికి, అర్థానికి నష్టం కలగదో అది ధర్మం. దాన్నే బుద్ధిమంతులు ఆచరిస్తుంటారు. అది ఆరోగ్య వంతమైనదీ, సురక్షితమైనది కూడా!

## —— కామవిద్య ఎప్పుడు నేర్చుకోవాలి ? ——

కామవిద్యని మగవాడు నేర్చుకోవడానికీ ఆడవాళ్ళు నేర్చుకోవడానికీ వేర్వేరు వయసుల్ని చెప్పాడు వాత్స్యాయనుడు.

1) ధర్మార్థకామాలను సేవించే దశని పొందిన మగవాడు మాత్రమే కామసిద్ధి కోసం కామవిద్యని నేర్చుకోవాలి.

2) ధర్మశాస్త్రాల్ని, అర్థశాస్త్రాల్ని, పాలనాశాస్త్రాల్ని (దండవిద్య) నేర్చుకోవడం అయిన తర్వాత - కామ విద్యను మగవాడు అభ్యసించాలి.

3) కామవిద్యలో పారంగతుడు కావాలంటే, మగవాళ్ళు సంగీత సాహిత్యాది కళల్లోకూడా ప్రావీణ్యత సంపాదించుకోవాలి.

4) "ప్రాగ్యౌవనాత్ స్త్రీ" అంటాడు వాత్స్యాయనుడు. స్త్రీల విషయానికొస్తే, యవ్వనం రావడానికి ముందే కామసూత్రాల్ని, సంగీత సాహిత్యాది కళల్ని నేర్చుకుని వుండాలట!

5) పడుచుదనం వచ్చేసరికి పెళ్ళిళ్ళు, పేరంటాలు అయిపోయేవి ఒకప్పుడు. బాల్య వివాహాలు జరిపే అలవాటు మనదేశంలో మొదటినుంచీ ఉండేది కాబట్టి పెళ్లికి ముందే - అంటే, యవ్వనానికి ముందే కామవిద్యని నేర్పించమన్నాడు వాత్స్యాయనుడు.

6) పెళ్ళయిన స్త్రీలు కూడా కామవిద్యని చదువుకోవడానికి అభ్యంతరం లేదు. అయితే, ఈ పుస్తకాన్ని బూతుపుస్తకంలా తలగడకింద దాచిపెట్టి రహస్యంగా చదవడం కాకుండా, భర్త అనుమతితో చదవడం మంచిది అన్నాడు. వీలైతే భార్యాభర్తలు ఇద్దరూ కలిసి చర్చించుకొంటూ చదివితే ఇంకా మంచిది కదా !

7) "ప్రయోగ గ్రహణం" అంటే, కామప్రక్రియల్ని పురుషుడి మీద ప్రయోగించడం, పురుషుడు ప్రయోగించిన వాటిని స్త్రీలు గ్రహించడం ఇవన్నీ చేయగల నేర్పు, స్త్రీ పురుషులకు ఆ ప్రక్రియల గురించి తెలిసినప్పుడే కదా..... కలుగుతుంది అని ప్రశ్నిస్తాడు వాత్స్యాయనుడు. సమర్థవంతమైన శృంగారం పురుషులకే కాదు స్త్రీలకుకూడా అవసరం. ఈ గ్రంథం స్త్రీ, పురుషులిద్దరి కోసమూ ఉద్దేశించిందే.

## —— శాస్త్రోక్తంగా కామకలాపాలు ——

శాస్త్రం చదవకపోయినా అనుభవం మీద చాలా విషయాలు తెలుస్తాయి. గుర్రంమీద స్వారీ చేసేవాడికి అశ్వశాస్త్రం అంతా తెలియవలసిన పనిలేదు కదా..... కారు నడిపే డ్రైవర్‌కి కారు మెకానిజం రాకపోతే, కారు నడవదా.....? ఇదంతా చెప్పి వాత్స్యాయనుడు అంటాడూ..... కారణం దూరంగా వున్నా జరిగే కార్యం ఆగకుండా జరుగుతూనే ఉంటుంది. రాజుగారు ఊళ్లో లేకపోయినా రాజ్యం నడుస్తూనే ఉంటుంది. కామశాస్త్రాన్ని ప్రత్యక్షంగా చదవకపోయినా కామకలాపాలు ఏమీ ఆగవు. కానీ, పోలీసు ఉన్నప్పుడు సిగ్నల్ లైట్‌ల దగ్గర గీతదాటకుండా ఎంత జాగ్రత్తగా ఉంటామో, అలాగే, కామశాస్త్రం తెలుసుకున్నప్పుడు, కామకలాపాల్లోనూ శాస్త్రోక్తంగా ప్రవర్తిస్తామంటాడు వాత్స్యాయనుడు.

శాస్త్రోక్తంగా ప్రవర్తించడం అంటే, శృంగారంలో ఎలాంటి మనోవికారాలకు అవకాశం లేకుండా, శారీరకంగా, మానసికంగా కూడా ఆరోగ్యకరంగానూ, సురక్షితంగానూ, సమర్థవంతంగానూ ప్రవర్తించడం అని.

## —— స్త్రీలకు కామశాస్త్రాన్ని స్త్రీలే నేర్పాలి ——

ఆడవాళ్ళకి కామశాస్త్రం ఎవరు నేర్పుతారన్నది పెద్దప్రశ్న! మగవాళ్ళకు ఎవరు ఎలా చెప్పినా ఇబ్బందిలేదు. ఆడవాళ్ళకి నేర్పించడమే కష్టం. అందుకని ఆడవాళ్ళకు కామశాస్త్రంలో ఆచార్యత్వాన్ని ఆడవాళ్ళే నిర్వహించడం మంచిదంటాడు వాత్స్యాయనుడు.

1) కామశాస్త్రంలో అనుభవం పండిన స్త్రీలే స్త్రీలకు ఆచార్యత్వం వహించాలి.

2) తనతో ఈడూ జోడుగా పెరిగి, తనకన్నా ముందే పురుష సంబంధం రుచిని తెలిసిన స్త్రీ అయితే మరీమంచిది.

3) తనను ప్రేమగా పెంచిన దాదిగాని, మనసెరిగి ప్రవర్తించే స్నేహితురాళ్ళుగాని ఈ ఆచార్యత్వ బాధ్యతలు వహించవచ్చు.



4) ఇంట్లో పనులు చేసిపెట్టే ముసలి దాసీలు ఇందుకు బాగా ఉపయోగపడతారు.

5) పెళ్ళికాని పిల్లలకు అన్నీ సందేహాలే ఉంటాయి. వాటిని నివృత్తిచేసే పరిజ్ఞానం ఉన్న స్త్రీలు కావాలిగాని, అనేక అనుమానాల్ని భయాల్ని అదనంగా తెచ్చి, తనమీద రుద్దేవాళ్ళు ఈ ఆచార్యత్వానికి పనికిరారు. అంటే, లైంగికపరమైన అంశాలపై సందేహాన్ని బాగా తెలిసిన వారినే అడిగి తీర్చుకోవడం మంచిది - అని !

6) వాత్స్యాయనుడు మగవాళ్ళ గురించి పెద్దగా పట్టించుకోలేదు. స్వేచ్ఛగా వాళ్ళు ఎవర్ని ఏదయినా అడిగి సందేహాలు తీర్చుకునే అవకాశం ఉంటుంది. కాని, నాలుగు గోడలకు పరిమితమైన ఆడపిల్లలు తమ మనసుల్లో చెలరేగే సందేహాల్ని ఎలా తీర్చుకోగలుగు తారు..... అనడుగుతున్నాడాయన.

7) ఆడపిల్ల పెద్దమనిషి అయ్యేనాటికే నెలసరి గురించి, ఆ మూడురోజులూ తీసుకోవాల్సిన జాగ్రత్తలు గురించి, గర్భధారణ గురించి..... ఇంకా ఇలాంటి అనేక విశేషాలు గురించి చక్కగా అర్థం అయ్యేలా తెలియజెయ్యకపోతే, పిల్ల పెద్దమనిషి అవుతుంది గాని, బుర్ర 'పెద్దమనిషి' కాదని గ్రహించాలి.

8) కామశాస్త్రం పురుషులకన్నా స్త్రీలకే ఎక్కువ అవసరం. ఒకరిని అడిగి తెల్సుకునే అవకాశం లేనివారికి ఈ పుస్తకం "స్వబోధిని"గా ఉపయోగపడ్తుంది! స్త్రీలు తమ శృంగార జీవితాన్ని సురక్షితంగా, అత్యంత సుఖదాయకంగా ఉండేలా ఈ పుస్తకం తోడ్పడుతుంది.

## —— ఆడవారికోసం 64 కళలు ప్రత్యేకం ——

కామశాస్త్రానికి అంగ విద్యలుగా 64 కళల్ని పేర్కొన్నారు. సంక్షిప్తంగా వాటిని మీకు పరిచయం చేస్తాను.

1) గీతం (సంగీతం).
2) వాద్యం (వీణ, వయోలిన్ మొదలైన వివిధ రకాల సంగీత వాయిద్యాలు).
3) నృత్యం.
4) ఆలేఖ్యం (చిత్రలేఖనం).
5) విశేషకచ్ఛేద్యం (ఈ రోజుల్లో బ్యూటీషియన్లు చేసే రకరకాల ఫేషియల్స్).
6) పుష్పాస్తరణం (పువ్వులతో పడకగది వగైరా అలంకరించడంలో నేర్పు).
7) తండులకుసుమబలి వికారం (భూతబలికోసం బియ్యపుపిండితో గాని, ముగ్గురాళ్ళ పిండితో గానీ పెట్టే అందమైన ముగ్గులు).
8) దశనవసనాంగ రాగం (శరీరాన్నీ, దుస్తుల్నీ రంగులతో అలంకరించడం).
9) మణి భూమికా కర్మ (తళ్ళు రాళ్ళతోనూ, మణులతోనూ అందంగా డిజైన్లు తయారుచేసే విద్యలు ఆడపిల్లలకు తెలిసి ఉండాలి. కామవిద్యలో ఇవన్నీ భాగాలే).
10) శయనరచనం : (శీతాకాలం, వేసవికాలం..... ఇలా కాలాన్ని బట్టి పడకగదిని ఏర్పరిచే నేర్పరితనం).
11) ఉదకవాద్యం (జలతరంగిణి వాయిద్యాన్ని వాయించడం) - ఇది మంచి కామోద్దీపాన్ని కల్గిస్తుంది).
12) ఉదకాఘాతం : హోలీ రంగులు చిమ్మగలగడం.
13) చిత్రయోగాలు : అందంగా మేకప్ చెయ్యగలగడం లేదా చేసుకోగలగడం.
14) మాల్యగ్రధన వికల్పాలు : చిత్ర విచిత్రమైన పూలచెండ్లు, దండలు అల్లే నేర్పరితనం.
15) శేఖర కాదయోజనం : "తలనిండ పూదండ దాల్చిన రాణి" అన్నట్లు పూలతో తలను అలంకరించుకోగలగడం.
16) నేపథ్యయోగాలు : రకరకాల అలంకరణ విద్యలు.
17) కర్ణపత్ర భంగాలు : చెవులకు సింగారం.
18) గంధయుక్త : రకరకాల అత్తర్లు, సుగంధ ద్రవ్యాలు తయారుచేసి ఉపయోగించడం.
19) భూషణయోగకం : నగలు వుండగానే అందంకాదు. వాటిని చక్కగా అలంకరించుకొనే చాకచక్యం కావాలి.



20) ఇంద్రజాలం : కనికట్టు విద్యలన్నీ..... మగవాణ్ణి ఆకర్షించే ఉపాయాలు.

21) కౌచుమారం : సుభగంకరణాది యోగాలు. చక్కని అలంకరణ సామగ్రితో అలంకరించ గలగడం.

22) హస్తలాఘవం : చేతిలో వస్తువులు మాయంచేసే విద్య.

23) విచిత్ర శాకయూష భర్క్య వికార క్రియా పానక రసరాగాసవయోజనం : అనేక రకాల కూరలు, పప్పులూ, భక్ష్యాలూ (పిండివంటలు), పానకాలు (షర్బత్‌లు), వివిధ తీపివంటకాలు, మద్యాలు (ఆసవాలు) తయారుచేయగల నేర్పరితనం.

24) సూచీవాన కర్మ : బట్టలుకుట్టడం (టైలరింగ్ నేర్చుకొని ఉండడం).

25) సూత్ర క్రీడ : వ్రేళ్ళతో దారాల్ని ముళ్ళువేసి తియ్యడం, కాల్చి తిరిగి తెప్పించి చూపించడం ఇలాంటి సరదా ఆటల్లో ప్రవేశం.

26) వీణాడమరుక వాద్యాలు : ఒకేసారి అనేక వాద్యాలను వాయించగల నేర్పు.

27) ప్రహేళికలు : ద్వంద్వార్థాలున్న మాటలతో కవిత్వం చెప్పడం.

28) ప్రతిమాల : స్వంతంగా పద్యాలు అల్లడం.

29) దుర్వాచక యోగాలు : అర్థంకాని రాతని కూడా అవలీలగా చదవడం. విలాసంకోసం క్లిష్టంగా వ్రాసిన దాన్ని చదవడం.

30) పుస్తక వాచనం : అందంగా, శ్రావ్యంగా కావ్యాలు గానం చేస్తూ చదివి వినిపించడం.

31) నాటకాఖ్యాయికా దర్శనం : నాటకాలు, నాటికాలు, వచన గ్రంథాలు అంటే కథలూ నవలలూ మొదలైనవి చదవడం.

32) కావ్యసమస్యా పూరణం : పద్యంలో ఒక పంక్తిని చెబితే, మిగతా మూడు పంక్తుల్నీ ఊహించి చెప్పడాన్ని సమస్యాపూరణం అంటారు. ఈ ఆధునిక రోజుల్లో అంత్యాక్షరి పేరుతో సినిమా పాటలు పెట్టుకొన్నట్లే ఆ రోజుల్లో ఆడపిల్లలు సమస్యాపూరణం ఆటలు ఆడుకొంటూ ఉండేవారు కాబోలు. ఆడపిల్లలు ఈ విద్యకూడా తెలిసికొని ఉండాలని వాత్స్యాయనుడు కోరుచున్నాడు.

33) పట్టకావేత్ర వాన వికల్పాలు : పేము, వెదురు, తాటాకులు ఇలాంటి వాటితో బొమ్మలు, వాడుకునే వస్తువులు, బుట్టల్లాంటివి అల్లడం.

34) తర్కు కర్మలు : అందమైన రకరకాల బొమ్మలుచేసి వాటికి నగిషీలు చెక్కి చక్కగా అలంకరించడం.

35) తరూణం : కొయ్యల్ని చెక్కి వివిధ వస్తువులు చెయ్యడం. బొమ్మలు చెక్కడం.

36) వాస్తువిద్య : ఇంటిని సర్దుకోవడానికి గాని, ఇంటిని కట్టుకోవడానికిగాని కావలసిన కనీస వాస్తు పరిజ్ఞానం ఆడపిల్లలకుండాలి. పూజగది ఎక్కడుండాలి, పడగ్గది ఎక్కడుండాలి..... ఇవన్నీ వాళ్ళకు తెలిసిఉండాలి.

37) రూప్యరత్న పరీక్ష : రూప్యాలు అంటే రూపాయిలు. డబ్బుగురించి, రత్నాలు, వజ్రాలు, బంగారపు వస్తువులు గురించి, వాటి నాణ్యత గురించిన విశేషాలు కూడా ఆడపిల్లలకు తెలిసి ఉండాలి.

38) ధాతువాదం : లోహాలు, ఖనిజాలు గురించి కనీస పరిజ్ఞానం.

39) మణిరాగాకర జ్ఞానం : మణుల గురించిన పరిజ్ఞానం.

40) వృక్షాయుర్వేద యోగాలు : మొక్కల్ని ఎలా పెంచాలి, ఎలా పోషించాలి, కూరగాయలు, పూలూ, పళ్ళూ పండించడం, విత్తనాలను నాటడం వాటికి సంబంధించిన పరిజ్ఞానం.

41) మేషకుక్కుట లావక యుద్ధ విధులు : మేకపోతులతోనూ, కోడిపుంజులతోనూ పందెం వేయించే విద్యలో ప్రవేశం, పరిజ్ఞానం.

42) శుకశారికా ప్రలాపాలు : చిలుకలూ, గోరువంకలు, పెంపుడు పక్షులు, పెంపుడు జంతువుల్ని పలకరించి, వాటితో సంభాషించడం, వాటిని మాట్లాడించడం.

43) ఉత్సాదన, సంవాహన, కౌశమర్దన కౌశలం : ఒళ్ళు పట్టడం, పాదాలు ఒత్తడం, (మసాజ్‌లు చెయ్యడం), చక్కగా తలంటడంలో నేర్పు.

44) అక్షర ముష్టికా కథనం : అక్షరాల్ని మధ్యమధ్య రాస్తూ కవిత్వం చెప్పడం.

45) మ్లేచ్ఛిత కవికల్పాలు : ఇతరుల కవిత్వంలో తప్పులు పట్టడం.

46) దేశభాషా విజ్ఞానం : వివిధ దేశభాషల్ని మాట్లాడగలిగే పరిజ్ఞానం.

47) పుష్పశకటిక : పూలతో (పూలపల్లకిలు) రథాలు తయారుచెయ్యడం. బహుశా దేవుడి ఊరేగింపు సమయంలో ఉపయోగించు విద్యలు.

48) నిమిత్త జ్ఞానం : శాసనాల గురించిన పరిజ్ఞానం.

49) యంత్ర మాతృక : యంత్రాలను నిర్మించడం.

50) ధారణ మాతృక : ఒక్కసారి చెబితే చాలు గుర్తుపెట్టుకో గలగడాన్ని ధారణ చెయ్యడం అంటారు. ఇది మనిషికి సహజంగా వుండవలసిన లక్షణం. ప్రయత్న పూర్వకంగానైనా సాధించుకోవచ్చు.

51) మానసీక్రియ : మనసుకు సంబంధించిన అవధానం మొదలైన విద్యలు 'అంటే, ఒకేసారి అనేక విషయాల గురించి ఆలోచించగలగడం వంటివన్న మాట'.

52) సంపాఠ్యం : కోరస్‌గా అందరూ కలిసి ఒక విషయాన్ని చదివేటప్పుడు, లేదా పాడేటప్పుడు అది పూర్తిగా నోటికొచ్చినదై ఉంటే వరస తప్పకుండా ఉంటుంది. అలా అందరితో కలిసి చెప్పే శక్తిని సంపాఠ్యం అంటారు.

53) కావ్యక్రియ : కావ్యాల్ని రచించగలగడం.

54) అభిధానకోశం : నిఘంటువుల్ని బాగా చదివి, అర్థాలు తెలుసుకొని ఉండడం. భాషమీద అధికారం.

55) ఛందో జ్ఞానం : ఛందస్సు బాగా చదివి ఉండడం.

56) క్రియాకల్పం : స్వంతంగా ఏ పనినైనా చెయ్యగలగడం. నమ్మకమైన ఆధారపడదగిన వ్యక్తిగా ఉండడం.

57) భవితకయోగం : ఒక వస్తువు స్వరూప స్వభావాల్ని మార్చేసి ఇంకొక వస్తువుగా చెయ్యగలగడం.

58) వస్త్రగోపనం : వస్త్రంతో కూడా ఇలాంటివే చెయ్యగలగడం.

59) ద్యూత విశేషాలు : రకరకాల జూదాల్లో ఉండే విశేషాలకు సంబంధించిన పరిజ్ఞానం.

60) ఆకర్ష క్రీడ : తాడు లాగుతూ ఆడే ఆట.

61) బాలల క్రీడనకాలు : పిల్లలాడుకొనే ఆటబొమ్మల్ని తయారుచెయ్యగలగడం.

62) వైనయికీ జ్ఞానం : గుర్రాల్ని, ఏనుగుల్నీ వశం చేసుకునే నేర్పు.

63) వైజయికీ జ్ఞానం : విజయాన్ని సాధించే ఉపాయాలు చెప్పే శాస్త్రం.

64) వ్యాయామికీ జ్ఞానం : శరీర వ్యాయామానికీ ఎక్సర్‌సైజులకూ సంబంధించిన పరిజ్ఞానం.

ఆడపిల్లలకు ఇలా అన్ని కళల్లోనూ ఎంతో కొంత ప్రావీణ్యం ఉండేలా ముందునుంచే తగిన శిక్షణ (ట్రైనింగ్) ఇవ్వమంటాడు వాత్స్యాయనుడు. వీటిలో ఏనుగులూ, గుర్రాల వంటివి ఏ కొద్దివో వదిలేస్తే చాలా విషయాలు ఈనాటి ఆడపిల్లలకు అవసరమైనవి ఉన్నాయి.

## —— పెళ్ళికిముందే స్త్రీలకు కామశాస్త్రం తెలియాలి ——

ఆ రోజుల్లోనే కాదు, ఈ రోజుల్లో కూడా ఆడపిల్లలకు అన్ని విషయాలూ తెలిసుండాలి అనే సిద్ధాంతం ప్రముఖమైనదే ! ఎన్ని మనం తెలిసేలా చెయ్యగలుగుతున్నాం అనేది ప్రశ్న!

అయినా, వంట చేయడం, భారత, భాగవతాలు చదవగలగడం వస్తేచాలు అనుకునే స్థితినుంచి ఆడపిల్లలు ఇంకా పూర్తిగా బయట పడలేదనేది వాస్తవం. మునుపు 'వరవీణా' వస్తే సంగీతం వచ్చినట్లేనని, హార్మోనీ పెట్టె ముందు కూర్చోబెట్టి ఫొటోలు తీయించేవాళ్ళు. రోజులు మారాయి. ఇప్పుడు ఆడపిల్లలు ఇంజనీర్లు, డాక్టర్లు అవుతున్నారు. ఆఫీసర్లు, కలెక్టర్లు కూడా అవుతున్నారు. వాత్స్యాయనుడు అలా ఆడపిల్లలు ఎదగాలని కోరుకున్నాడు.

పెళ్ళినాటికి ఆడపిల్ల – ఏ పరిస్థితుల్లో ఏమార్పులు వచ్చినా – తన కాళ్ళమీద తాను బతికే విధంగా ఆడపిల్లల్ని పెంచాలని తల్లిదండ్రులకు సూచించాడు. "దేశాంతరేஉపి విద్యాభిస్సా సుఖేనైవ జీవతి" అన్నాడు. ఈ దేశంలో కాకపోతే ఇంకోదేశంలోనైనా సరే, చేతిలో 'విద్య' ఉంటే సుఖంగా జీవించగలదని స్పష్టంగా చెప్పాడు.

ఇవి ఆడపిల్లలకే కాదు, మగపిల్లలక్కూడా వర్తించే సంగతులే. "కళానాం గ్రహణాదేవ సౌభాగ్య ముపణయతే" అన్నాడు. అంటే "భార్యాభర్తలు ఇద్దరూ విద్యావంతులైతే సౌభాగ్యం వాళ్ళ స్వంతం అవుతుంది" అని.

సకలశాస్త్రాలూ చదివి, కామసూత్రాల్ని కూడా పఠించిన తర్వాతే పెళ్ళి చేసుకోవడం మంచిది.



బతకడానికి డబ్బు కావాలి. భార్యతో సుఖంగా కాపురం చెయ్యడానికి డబ్బు కావాలి. డబ్బెలా సంపాదించాలి ?

1) బ్రాహ్మణుడు తన మేధాశక్తిని ఉపయోగించి దాన, ధర్మాల ద్వారా ఈ డబ్బులు సంపాదించాలి.

2) రాజులు, పాలకులు దిగ్విజయాలు సాధించడం ద్వారా, జనరంజకంగా పాలించడం ద్వారా డబ్బు సంపాదించాలి.

3) వ్యాపారులు తమ వ్యాపారాల్ని కొత్త రంగాల్లోకి విస్తరించుకుంటూ సంపాదించాలి.

4) ఇతరులు... వ్యవసాయం, తదితర వృత్తుల్ని చేపట్టి డబ్బు సంపాదించాలి.

ఈ రోజుల్లో ఇలా ఫలానా కులంవాడు అని చెప్పడం సాధ్యం కాకపోవచ్చు. ఎవరికి దొరికిన అవకాశాన్ని వాళ్ళు ఉపయోగించుకొని ధనవంతులు కావడానికి ప్రయత్నించాలనేదే వాత్స్యాయనుడి ఉద్దేశ్యం. తాను నేర్చిన విద్యల్ని ఆచరణలో పెట్టి గృహస్థుగా మారడం గురించి ఆలోచించమంటాడు వాత్స్యాయనుడు. ఈ అధ్యాయంలో ఇదే ముఖ్యవిషయం!

## —— ఎక్కడ జీవించాలి ? ——

నగరం అంటే 800 ఊళ్ళు (Hamlets) చుట్టూవున్న పెద్ద గ్రామం. పట్టణం అంటే, రాజులు, అధికారులు నివసించే స్థాయికల్గిన పెద్దనగరం. నగరం కన్నా చిన్నదాన్ని ఖర్వాటం అంటారు. కనీసం 400 ఊళ్ళు దీని చుట్టూ ఉంటాయి. ఖర్వాటానికి, నగరానికి మధ్యస్థాయి కలది ద్రోణముఖం. కనీసం 600 ఊళ్ళు ఉన్న పెద్ద గ్రామం ద్రోణముఖం.

వాత్స్యాయనుడి కాలానికి అమలులో ఉన్న లెక్కలివి. ఇవి ఎందుకు చెబుతున్నాడంటే, గృహస్థు అయినవాడు తను నివసించడానికి చిన్న గ్రామంతో మొదలుపెట్టి, పెద్ద పట్టణం దాకా ఎక్కడైనా జీవించడానికి సిద్ధంగా ఉండాలి. ఎక్కడ జీవించాలో ముందుగానే నిర్ణయించుకోగలిగి ఉండాలి.

తనకువచ్చిన విద్యలు ఎక్కడ ఎక్కువ వినియోగపడతాయో దాన్నిబట్టి గ్రామంలో ఉండాలో పట్టణంలో ఉండాలో తేల్చుకోమన్నాడు.

## —— ఎలాంటి ఇంట్లో ఉండాలి ? ——

ఎక్కడ జీవితం గడపడానికి అనుకూలంగా ఉంటుందో అక్కడ ఒక ఇల్లు ఏర్పాటు చేసుకోవాలి. అద్దె ఇల్లా, స్వంత ఇల్లా అనేది వేరేసంగతి. అనుకూలమైన చోట మంచి ఇంట్లో నివసించేందుకు ముందుగా రూపకల్పన చేసుకోవాలి.

1) ఇంటికి సమీపంలో నీటి వసతి బాగా ఉన్నదా లేదా చూసుకోండి. అంటే దగ్గరగా నదిగాని, చెరువులు గాని, కాలువలు గాని ఉంటే మనకు నీటికొరత రాదన్నమాట. "ఆసన్నోదకం" అన్నాడు ఈ సూత్రాన్ని.
2) చుట్టూ మొక్కలు, చెట్లు బాగా వున్నచోటైతే చల్లగా ఉంటుంది. ఆరోగ్యవంతమైన వాతావరణం వుంటుంది. "వృక్ష వాటికా వత" అనే ఈ సూత్రంలో మొక్కలులేని ఇంట్లో నివసించడం మంచిది కాదనే భావనని వాత్స్యాయనుడు స్పష్టీకరించాడు.
3) ఇంట్లో ఏ పనికి ఆగది విడివిడిగా ఉండాలి. వంటగది, పడగ్గది, మధ్యహాలు, డైనింగ్ రూం..... ఇవన్నీ వాస్తుప్రకారం ఉండేలా జాగ్రత్తపడాలి.
4) పడకగదికి తగినంత మరుగు ఉండాలి. ఎవరికైనా శబ్దాలు విన్పిస్తాయని, ఎవరైనా చూస్తారని భయం అనుమానం వున్నప్పుడు ఆ భార్యా భర్తలు సుఖించలేరు. "వాసగృహం" అంటే మరుగైన, మెరుగైన పడక గది ఉన్న ఇల్లు అని అర్థం చెప్పుకోవాలి.

## —— ఇల్లు సర్దుకోవడం ఇలా ! ——

ఇప్పుడు ఇల్లు ఎలా సర్దుకోవాలో మహర్షి చెబుతున్నారు. వాత్స్యాయనుడి కాలానికి ఫ్రిజ్‌లు, టీవీలు లేకపోవచ్చు. అయినా సర్వకాలాలకూ వర్తించే అనేక విషయాలు తెలుసుకోవాల్సినవి ఉన్నాయి.

1) ఇల్లు ఆడవాళ్ళు స్వేచ్ఛగా కదిలేందుకు వీలుగా ఉండాలి. హాలులోనో, వరండాలోనో మగాళ్ళు పేకాట పెట్టుకుంటే, ఇంట్లో ఆడవాళ్ళు వంటగదిలో తలుపు బిగించుకొని కూర్చోవలసిన పరిస్థితి ఉండకూడదు.
2) బైటవాళ్ళు, పరాయివాళ్ళు వచ్చి మాట్లాడి వెళ్ళేందుకు విడిగా ఒక ప్రత్యేకమైన అతిథి గృహంగాని, హాలుగాని, పెద్ద గదిగాని వుండాలి. బైటవైపు ఉంటే మంచిది.
3) ఇంట్లో అన్నిగదులూ ఒక హాలులోకి గాని, పెద్దగదిలోకి గాని తెరుచుకునేలా ఉండాలి.
4) పడకగదిని ప్రత్యేక అలంకారంతో అందంగా అమర్చుకోవాలి.
5) చాలా సుందరమైన నగిషీలు చెక్కిన, చూడగానే అద్భుతం అనిపించే మంచం ఉండాలి. దాన్ని చూడగానే కామోద్దీపనం కలిగేలా ఉండాలి.
6) దానిమీద మెత్తని దూది పరుపు పరచివుంచాలి. తలవైపూ, కాళ్ళవైపూ తలగడలు వుంచుకోవాలి. సుఖప్రదంగా ఉండాలి పడుకోవడానికి.
7) గదిలోకి వెళ్ళేసరికి సువాసనలు గుబాళించే ఏర్పాట్లు ఉండాలి.



8) లైంగిక కార్యానికి తలపడేందుకు ఉపయోగించే మంచమూ, రోజూ నిద్ర పోయేందుకు ఉపయోగించే మంచమూ వేర్వేరుగా ఉండాలి. అందుకోసం, అదేగదిలో రెండు వేర్వేరు మంచాలు ఏర్పాటు చేసుకోమంటాడు.

9) పెద్ద మంచానికి మధ్యలో పల్లం వుండి, పడక కుర్చీలా వుంటే, లైంగిక కృత్యాలకు అనుకూలంగా ఉంటుందని వాత్స్యాయనుడి సూచన. మధ్యలో పల్లం వున్న మంచం మీద పడుకుని నిద్రపోతే నడుంపట్టేసే అవకాశం ఉంటుంది కాబట్టి, నిద్రపోవడానికి వేరే మంచం వాడుకోండి, పెద్దమంచం నిద్రపోయేందుకు ఉపయోగించవద్దు - అన్నాడు వాత్స్యాయనుడు.

10) రెండు, మూడు రోజులకొకసారి పెద్దమంచం మీద దుప్పట్లు, గలీబులు ఉతికించాలి.

11) పెద్ద మంచం పక్కన చిన్న టీపాయ్ వంటిది ఏర్పాటు చేసుకోమన్నాడు. 'వేదిక' అన్నాడు దీన్ని. అలాగే, పడుకోబోయే ముందు దైవ ప్రార్థన గాని, మెడిటేషన్ గాని చేసుకోవడానికి 'కుర్చీ స్థానం' కూడా ఏర్పాటు చేసుకోమన్నాడు. బహుశా దర్భల చాపగాని, జింకచర్మంగాని పరచిన స్టూలువంటిది కావచ్చు.

12) లవంగాలు, జాజికాయలు, జాపత్రి, పచ్చకర్పూరం వేసిన తాంబూలం, మంచి విసనకర్ర (ఏసీ సౌకర్యమో, సీలింగ్ ఫ్యానో, టేబుల్ ఫ్యానో ఆ అవసరాన్ని తీరుస్తాయి). వీటిని టీపాయ్ మీద వుంచుకోవాలి. తాంబూలం వేసుకున్నప్పుడు తమ్మి ఉమ్మేసే పాత్ర (పతద్గ్రహం)ని టీపాయ్ కింద ఉంచాలి. గంతలు, పూలమాలలు, అత్తరులు రోజూ వాడుకోనేవన్నీ యథాస్థానంలో ఉంచాలి.

13) భార్యాభర్తలు మధ్యహాలులోనూ, ఇతరగదుల్లోనూ నల్గురి మధ్య గడిపే కాలం ఒక ఎత్తయితే, ఇద్దరే ఒంటరిగా పడక గదిలో గడిపేది ఇంకొక ఎత్తు. ఆ గదిలోకి పగటి పూటకూడా ఇతరులు వెళ్ళకూడదు. ఆ గది వాళ్ళిద్దరూ లేనప్పుడు మూగది!!

14) సరదాగా భార్యాభర్త లిద్దరే ఆనందించడం కోసం గోడకు ఏనుగుదంతం అమర్చి దానికి వీణని తగిల్చి వుంచుకోవాలి. దాన్ని మంచి గుడ్డతో కప్పి వుంచాలి. పక్కనే ఒక డ్రాయింగ్ బోర్డు స్టాండు పెట్టుకునేందుకు చోటు ఏర్పాటు చేసుకోవాలి. భార్యాభర్తలు ఇద్దరూ అరవైనాలుగు కళల్లో నిష్ణాతులై వుంటేనే ఈ ఏర్పాట్లను ఆనందించగలుగుతారు.

15) రెండు రకాల శయ్యలు ఏర్పాటు చేసుకోవాలని చెప్పాడు గదా..... వాటికి దగ్గరగా విశ్రాంతికోసం ఒకటి రెండు పడకకుర్చీలు గానీ, పేము కుర్చీలు గానీ ఏర్పరచుకో మన్నాడు.

16) ఒక నిలువుటద్దం ఉండాలి, మంచి శృంగారాత్మకమైన రంగురంగుల బొమ్మలు గదికి అలంకారంగా ఉండాలి.

17) బయట బాల్కనీలో చిలక పంజరం..... ఇలాంటివి వ్రేలాడుతూ ఉండాలి.

18) మంచి పొదరిల్లు, ఉద్యానవన విహారాలు, చెట్ల కొమ్మలమధ్య ఉయ్యాల ఇలాంటివి వున్న దంపతులు ఏకాంతంలో ఆనందించగలుగుతారు.

## —— మగవాళ్ళ దినచర్య ——

1) ఉదయాన్నే లేవాలి. కాలకృత్యాలు తీర్చుకోవాలి. దంతధావనాదులు పూర్తిచేసుకోవాలి. స్నానం, సంధ్య, జపం పూర్తిచేసుకోవాలి.

2) శరీరానికి గంధాదులతో అనులేపనం చేసుకోవాలి. అత్తరులు వాడుకోవచ్చు.

3) సుగంధ భూయిష్టమైన ధూపం వేసుకోవాలి.

4) ఆ రోజుల్లో మగవాళ్ళు కూడా లిప్‌స్టిక్‌లు వాడేవాళ్ళు కాబోలు - లక్కతో పెదాలకు ఎర్ర రంగు పులుముకోమన్నాడు.

5) అద్దంలో ఇంకోసారి ముఖం చూసుకొని బయల్దేరాలి.

6) వెళ్లేటప్పుడు తాంబూలం వేసుకోవడం, తాంబూలం పెట్టె చేత్తోపుచ్చుకొని తన వృత్తి వ్యాపారాల్లోకి వెళ్ళాలి.

7) వాత్స్యాయనుడి కాలానికి పురుషుల వేషధారణ, దినచర్యలు ఇలా ఉండేవి..... తాంబూలానికి ఆ రోజుల్లో ఎక్కువ ప్రాధాన్యత ఉండేది. పెళ్లిళ్ళ దగ్గర నుంచీ వ్యాపార ఒప్పందాలదాకా ప్రతిదానికి తాంబూలాలు ఇచ్చుకోవడం ఒక ఆచారంగా ఉండేది. అందుకని ఇక్కడ తాంబూలం పెట్టె గురించి ప్రత్యేకంగా ప్రస్తావించాడు.

## —— వస్త్రధారణలో ఒక విశేషం ——

నిత్యం స్నానం : రెండుపూటలా చెయ్యాలి. ఇందువలన చర్మ సౌందర్యం, చర్మం ఆరోగ్యం పదిలంగా ఉంటాయి.



రోజు విడిచి రోజు ఒళ్ళు పట్టించుకోవాలి.

మూడు రోజులకొకసారి తలంటి పోసుకోవాలి.

నాలుగు రోజులకొకసారి క్షవరం చేయించుకోవాలి.

ఐదురోజులకొకసారి క్రింది వెంట్రుకలను కత్తిరించేయాలి. కనీసం పది రోజులకొక సారయినా ఈ పనిని తప్పకుండా చెయ్యాలి.

చంకల్ని మూసే విధంగా చేతులబనీనులు తొడుక్కొని ఎక్కువ సేపు ఉండకూడదు. "సాత త్యాచ్చ సంవృత కక్షా స్వేదాపనోదః" అన్నాడు ఈ సూత్రంలో. అంటే, ఎప్పుడూ చంకలకు గాలి తగిలేలా చూసుకోవాలి. చంకల్లో చెమట ఎక్కువగా పట్టుంటే, పొడిగుడ్డతో తుడుచుకొంటూ వుండాలి. లేకపోతే మన శరీరం మనకే వాసన కొడుతుంది. బహుశా వాత్స్యాయనుడి కాలంలో స్త్రీ పురుషుల వేషధారణలో చంకలకు గాలి తగిలేలా, పైన చున్నీ లేదా ఉత్తరీయంతో కప్పుకొనే అలవాటు స్త్రీ పురుషులిద్దరికీ ఉండేదనుకొంటాను. స్త్రీలకు జాకెట్లు, పురుషులకు వస్త్రాలు మహమ్మదీయ మహాయుగంలో అలవాటుగా వచ్చి ఉంటాయి.

## —— భోజనం ఎప్పుడు చెయ్యాలి ? ——

రాత్రినీ, పగలునీ ఎనిమిది, ఎనిమిది భాగాలుగా విభజించారు. పగటి ఎనిమిది భాగాలలో ఉదయం నుంచి మధ్యాహ్నం వరకూ నాలుగు భాగాలు, మధ్యాహ్నం నుంచి సాయంత్రం వరకూ నాలుగు భాగాలుగా విభజించాడు. "పూర్వాపరోహ్ణ యోర్భోజనం"

అనే సూత్రంలో, ప్రొద్దున మూడు భాగాలలో కాలకృత్యాలు, స్నానాదులు పూర్తిచేసుకొని, 9-10 గంటల మధ్య వృత్తి వ్యాపారాలకోసం ఆఫీసుకు వెళ్ళమన్నాడు. అపరాహ్నం అంటే, మధ్యాహ్నం 12 గంటలకు నాలుగోభాగం. ఇప్పుడు మళ్ళీ స్నానంచేసి భోజనం చెయ్యాలి. 5, 6, 7 భాగాలలో వృత్తి వ్యాపారాలు కొనసాగించి సాయంత్రం చివరి భాగంలో అంటే, 8వ భాగంలో రాత్రి 7-8 గంటల మధ్య ఇంటికి వచ్చి స్నానంచేసి భోజనం చెయ్యాలి. ఇది వాత్స్యాయనుడు సూచించిన లైఫ్ స్టయిల్. మధ్యాహ్నం కాకముందే పగలు భోజనం పూర్తిచేసేయమని కొందరు మహర్షులు చెప్తారు. కానీ, వాత్స్యాయనుడు 12-00 గంటల తర్వాత లంచ్ తీసుకోవాలని స్పష్టంగా చెప్పాడు.

మధ్యాహ్నం భోజనం చెయ్యగానే ఉరుకులూ పరుగులూ పెడుతూ ఆఫీసుకు బయల్దేరడం వలన అనేక అనారోగ్యాలు కలుగుతాయి. కాసేపు పంజరంలో చిలకలతోనూ, పెంపుడు జంతువులతోనూ కాలక్షేపం చెయ్యమన్నాడు. ఇప్పటి రోజుల్లో అన్ని కాలక్షేపాలకు మించింది టీవీ చూడడం, పేపరు చదువుకోవడం. ఏదిఏమైనా సాధ్యమైనంత వరకూ పగలు భోజనం తర్వాత నిద్రపోకుండా ఉండటం అవసరం.

మండువేసవి కాలంలో మాత్రం భోజనం తర్వాత తగినంత వ్యవధినిచ్చి కొద్దిసేపు పడుకున్నా దోషంలేదు. చిన్నపిల్లలు, వయోవృద్ధులకు మాత్రం పగటిపూట నిద్రపోవడం వలన హాని కలగదు.

సాయంకాలం పూట, చీకటిపడ్డాక వృత్తి వ్యాపారాలు ముగించుకొని ఆఫీసు మూసేసి ఇంటికొచ్చాక కొద్దిసేపు సంగీత, సాహిత్యాది శాస్త్ర చర్చలతో కాలక్షేపం చెయ్యాలి.

## —— కాలక్షేప సాధనాలు - మగవారికోసం ప్రత్యేకం ——

మనిషన్నాక కొంచెం అయినా కళాపోషణ ఉండాలనేది నిజం. వాత్స్యాయనుడు ఈ విషయాన్ని మరీ గట్టిగా నొక్కిచెప్తున్నాడు. ఈ కాలక్షేప సాధనాల్నీ 'నైమిత్తికాలు' అన్నాడు. 'నైమిత్తికాలు' అంటే ఇష్టాగోష్ఠి సభల్లాంటివి.

ఆధ్యాత్మికపరమైనవి, దేవుడికి సంబంధించిన వాటిని ఘటా నిబంధనం అంటారు. దేవుడుకోసం చేసే ఉత్సవాల్లో ఊరుజనం అంతా పోగౌతారు కాబట్టి నలుగురుతోనూ స్నేహం పెంచుకోవడానికి, మనసులో భావాలు ఇచ్చిపుచ్చుకోవడానికి వీలౌతుంది. త్వరగా ప్రజాదరణ పొందేందుకు ఇది మంచి ఉపాయం. వాటిని పీరియాడికల్‌గా 'ఇన్ని రోజులకొకసారి.....' అని నిర్వహించడాన్ని ఘటా నిబంధనాలంటారు.

ఇంక రెండోది 'గోష్ఠీ సమవాయం'. సాహితీ, సాంస్కృతిక సేవా సంస్థల్ని నెలకొల్పి పురప్రముఖుల్లో ఉత్సాహవంతుల్ని ఆహ్వానించి ఆయా అంశాలకు సంబంధించి వివిధ

కార్యక్రమాలు చేపట్టడం, సభలు జరపడం..... ఇదంతా గోష్ఠీ సమవాయం ! సభలూ, సమావేశాలలో మనుషులతో బంధాలు పెంచుకోవడానికి ఎక్కువ అవకాశం ఉంటుంది. మంచిపేరు, కీర్తి ప్రతిష్టలు పెరగడానికి ఇవి బాగా తోడ్పడతాయి.

ఇలాంటి గోష్ఠులు పూర్వకాలంలో వేశ్యల ఇళ్లలో ఎక్కువగా జరుగుతూ ఉండేవి. నలుగురూ ఇళ్ళకు వచ్చిపోతే, తమకూ పరిచయాలౌతారని వేశ్యలు సంగీత, నృత్య, సాహిత్యాది అంశాల మీద గోష్ఠులు పెట్టేందుకు ఉత్సాహం చూపించేవాళ్ళట. వాత్స్యాయనుడు ఈ విషయాన్ని ప్రస్తావించాడు "సహ వేశ్యాభిరనురూపై రాలాపై రాసన బంధో గోష్ఠీ" అని ఒక సూత్రం చెప్పాడు. భాగ్యం, సంపదలు, వయసులో సమానులైన కొందరు పురప్రముఖులు ఈ వేశ్యా జనంతో చేరి ఒకరినొకరు పొగుడుకుంటూ, క్రీగంటి సైగలతో కవ్వించుకొంటూ, కులాసాగా తమకు తగిన ఆసనాలలో కూర్చొని వినోదించడాన్ని 'గోష్ఠీ సమవాయం' అన్నాడు.

ఆనాటి సామాజిక వ్యవస్థలో ఇతర వ్యాపకాలకు అవకాశాలు తక్కువగా ఉండడం, వేశ్యాసంగమంపై పెద్దగా సామాజిక వ్యతిరేకత లేకపోవడం వలన మనుషులు తమ విరామసమయాన్ని ఇలా కాలక్షేపం చేసేవాళ్ళని మనం అర్థం చేసుకోవాలి.

ఇంక మూడో రకం కాలక్షేపసాధనాన్ని కూడా వాత్స్యాయనుడు రికార్డుచేశాడు. "పరస్పర భవనేషు చా పానకానీ" అనే సూత్రంలో 'పానగోష్ఠులు' గురించి ప్రస్తావించాడు. అంటే, మందుపార్టీలన్నమాట. మందుపార్టీలకు హాజరయ్యే ప్రముఖులు ఒక్కొక్కసారి ఒక్కొక్క ఇంట్లో వంతులప్రకారం పానగోష్ఠులు జరుపుకొంటూ వుంటారట.



**"వివిధ లవణ ఫల రహరిత శాకతిక్తా కటు కామ్లోప దంశాన్....."** అంటే, పెప్పర్ సాల్ట్, రకరకాల పళ్ళ ముక్కలు, వెజిటబుల్ సలాడ్‌లు, కొంచెం తీపి, కొంచెం పులుపు, కొంచెం కారంగా ఉండే పదార్థాల్ని మద్యపానం చేసేటప్పుడు "మంచింగ్" పేరుతో సిద్ధంగా ఉంచుకొనేవాళ్ళట. ఇప్పటి ఫైవ్‌స్టార్ బార్లలో దొరికే సౌకర్యాలకు ఆనాటి మానవులు తక్కుగా ఏమీ అనుభవించలేదనడానికి ఇది మంచి సాక్ష్యమే !" **వేశ్యాః పాయయే యురనుపి చేయుశ్య"** అని ఆ రోజుల్లో మందుపార్టీల్లో జరిగే ఒక విశేషాన్ని చెప్పాడు. మద్యాన్ని పోయడానికి ప్రత్యేకంగా వేశ్యల్ని ఏర్పరచుకొనే వాళ్ళట. మొదట ఆ వేశ్యలకు బాగా తాగబోయించి తర్వాత వాళ్ళచేత బతిమాలించుకొంటూ వీళ్ళు తాగేవారట! అదీ సంగతి.

## —— బోగస్ కామశాస్త్ర పండితులు ——

కన్యాశుల్కం నాటకంలో గిరీశం పాత్రలాంటి వ్యక్తులు ఆ రోజుల్లోకూడా ఉండేవారు. వాళ్ళకి "పీఠ మర్దుదు" అని పేరుపెట్టాడు. పిలవని పేరంటంగా మందుపార్టీలకి వెళ్ళి తన పీటతానే వేసుకొని కూర్చునేవాడని వ్యంగ్యంగా పీఠ మర్దుదని పేరుపెట్టాడు. ఏం చేస్తాడు.....? దరిద్రుడు! చేతిలో డబ్బులేదు. అందుకని, కొంచెం 'కళాపోసన' పట్టిన ఇలాంటి వ్యక్తి తెలివిగా 'గురువు' అవతారం ఎత్తుతాడు. తానే ఉపదేశికుడుగా ఉంటూ జనంచేత ఇలాంటి గోష్ఠి సమావేశాలు (మందు పార్టీలు) జరిపిస్తూ ఉంటాడు. వేశ్యాజనాన్ని పరిచారికలుగా రప్పించి (కేబరే డ్యాన్సులు చేయించి) వాళ్ళను ఉపయోగించి డబ్బు సంపాదించుకొనే ప్రయత్నంలో ఉంటాడు. తనకు తానే కామశాస్త్రాచార్య పదవిని అలంకరించి, చివరికి తార్పుడు వృత్తిలోకి దిగుతాడు. ఇలాంటి దొంగ గురువుల దొంగ పీఠానికి 'మల్లికాదండ పీఠం' అనే పేరు పెట్టాడు వాత్స్యాయనుడు.

ఈ సూత్రాన్నిబట్టి, ఆ రోజుల్లో చాలామంది డాఫర్లు కామశాస్త్ర గురువులుగా చెలామణి అవుతుండే వాళ్ళనీ, అలాంటి వాళ్ళనుంచి జాగ్రత్తగా ఉండడానికి వాత్స్యాయనుడు ఈ హెచ్చరిక చేశాడని మనకు తేలికగానే అర్థం అవుతోంది. ఈ తార్పుడుగాళ్ళు, తార్పుడు కత్తెలూ ఆరోగ్యవంతమైన, సురక్షితమైన శృంగార జీవితాన్ని కలుషితం చేస్తారు. వీరినుంచి ప్రతి ఒక్కరూ దూరంగా ఉండితీరాలి.

## —— తార్పుడుగత్తెలుంటారు జాగ్రత్త! ——

మగవాళ్ళలోనేకాదు, స్త్రీలను తార్చే వృత్తిలో ఆడవాళ్ళు చాలామంది ఉంటారు. ముఖ్యంగా బౌద్ధ భిక్షిణీ, సన్యాసిని, దాసీ, వృద్ధ వేశ్యలు సంధి విగ్రహాలను కుదురుస్తూ ఉంటారు. అంటే బేరాలు తెచ్చి పరిచయాలు చేస్తుంటారన్నమాట. వాత్స్యాయనుడు

తార్పుడు గత్తెని "కుట్టిని" అని పిలిచాడు. వీళ్ళు పెద్ద దైవభక్తురాళ్ళుగానో, సంఘసేవికలుగానో కన్పిస్తుంటారు. వీరి గురించి ఒక కంట కనిపెట్టి ఉండి, ఇలాంటి వాళ్ళ మాయలో పడకుండా దూరంగా ఉండటం మంచిదని మరిమరి హెచ్చరిస్తున్నాడు వాత్స్యాయనుడు. సురక్షితమైన సెక్సు వీరివలన అసాధ్యం అవుతుంది.

## —— ఎలాంటి సంస్థల్లో సభ్యుడిగా చేరాలి ? ——

ఇదంతా చదివినతర్వాత సభలూ, సమావేశాలకు వెళ్ళడమే నేరమని, అవన్నీ ఇలాంటి అడ్డదారి సుఖాలకోసమే జరుగుతాయనే అభిప్రాయం మనకు ఏర్పడవచ్చు. అందుకని వాత్స్యాయనుడు ఒక పెద్ద సూత్రం చెప్పాడు.

తన అభిప్రాయాలతో ఏకీభవించే సజాతీయుల్ని, మంచీ చెడూ విచక్షణా జ్ఞానం కలిగిన వాళ్ళని, సంగీత సాహిత్యాది కళలలో కుతూహలం కల్గిన వాళ్ళనీ ప్రోత్సహించి, ఒక సంస్థగా ఏర్పడడం మంచిది. లోకంలో ఉత్తమమైన నాగరకులు ఇలా చెప్తున్నారు. మనంకూడా ఇలా ఎందుకు చెయ్యకూడదూ..... అంటూ వారిని ప్రోత్సహించాలి. వారి ద్వారా ఇంకా అనేకమందిని ఇందులో చేర్పించాలి.

సభలలో శుద్ధ ఛాందసమైన సంస్కృత భాషని అతిగా వాడకుండా, అలాగని నాటు భాషలో మాట్లాడకుండా (దేశ భాషలు, సామాన్యులు మాట్లాడుకునే స్థానిక భాష) గోష్ఠీ ప్రసంగాలలో అందరికి అర్థం అయ్యేలా ఉభయ భాషల్లోనూ చమత్కారంగా మాట్లాడే వాళ్ళు ఎక్కువగా రాణిస్తారు.

తనంత తానుగా ఒక గోష్ఠి (సంస్థ)ని నిర్వహించగలిగే స్థాయి లేకపోతే, బుద్ధిమంతుడైన వాడు ఇతరుల గోష్ఠులలో చేరాలి..... అంతేకాదు ఇంకో ముఖ్యమైన సూచనకూడా చేస్తున్నాడు..... **"యా గోష్ఠీ లోక విద్విష్టా యాచ స్వైర విసర్పిణీ పర హింసాత్మకాయంచ, నతా మవతరౌద్బుధః"** అని! అంటే, తాను ఇంకొక గోష్ఠి (సంస్థ)లో చేరబోయే ముందు, దానికి చెడ్డపేరుందనీ, అందులో స్వేచ్ఛగా ప్రవర్తించే స్త్రీలు వున్నారని తెలుసుకొన్నప్పుడు ఆ సంస్థలో చేరకుండా ఉండాలి - ఒకవేళ చేరిన తరువాత తెలుసుకొంటే, మంచిగా బైటకు వచ్చేయాలి - అని సూచించాడు వాత్స్యాయనుడు.

సభ్యులకు ఆహ్లాదాన్ని, వినోదాన్ని మాత్రమే కల్గించే గోష్ఠులు స్వేచ్ఛా చారిణులైన వేశ్యలకు దగ్గరచేస్తాయని కూడా హెచ్చరించాడు. కాబట్టి ! సామాజిక అంశాలనూ, సేవాకార్యక్రమాలనూ చేపట్టే సంస్థల్లో సభ్యత్వం మంచిదిగాని, ఇలాంటి ఫన్‌సెంటర్లు, క్లబ్‌లు అపకారం చేసేవిగా వుంటాయని ఆయన హెచ్చరిక !

## —— కీర్తిని కల్గించే కామం ——

"ఎలాంటి కామం వంశాభివృద్ధినీ, కీర్తి లాభాన్ని, లోక సమ్మతాన్ని కల్గిస్తుందీ?" అని ప్రశ్నించి, వాత్స్యాయనుడు ఒకే వాక్యంలో సమాధానం చెప్పాడు. నాలుగు జాతుల పురుషులు తమ సజాతీయురాలైన కన్యకను శాస్త్రోక్త పద్ధతిలో పెళ్ళాడి, భార్య అనే పేరుతో పిలవబడే స్త్రీతో జరిపే కామాన్ని కీర్తిని కల్గించే కామంగా పేర్కొన్నారాయన.

తనకన్నా ఉత్తమ జాతి స్త్రీని పెళ్లిచేసుకున్నా, తక్కువజాతి స్త్రీని పెళ్లి చేసుకున్నా కలిగే తేడాలు పరోక్షంగా వ్యభిచారాన్ని ప్రోత్సహించే ప్రమాదం ఉందని వాత్స్యాయనుడి భావన.

కామం రెండు రకాల ప్రయోజనాల్ని ఆశిస్తోంది. ఒకటి సుఖం. రెండోది సంతానం. సత్సంతానం కోసం జరిపే కామాన్ని మాత్రమే శాస్త్రం ఉత్తమమైనదిగా అంగీకరిస్తోంది. సుఖంకోసం జరిపే కామం సురక్షితమైనదిగా లేనప్పుడు కలిగే అనర్థాలకు ఎవరిని నిందించగలం? "చేసిన వాడికి చేసినంత" అన్నట్లవుతుంది!

## —— కామప్రాప్తిని పొందే స్త్రీలు మూడు రకాలు ——

కామానికి వినియోగపడే స్త్రీలని మూడు రకాలుగా వర్గీకరించాడు వాత్స్యాయనుడు.



1) **కన్యక :** అంతవరకూ ఎలాంటి పురుష సంపర్కమూ ఎరుగని స్త్రీలని కన్యక లంటారు. వీళ్ళు రెండు రకాలు. సత్పురుషుణ్ణి వివాహమాడడం ద్వారా ఉత్తమ సంతానాన్ని కనడానికి కారకు లౌతారు కాబట్టి పుత్రఫల ప్రదలని వారిని పిలుస్తారు. రెండోరకం కన్యల్ని సుఖఫలప్రదలంటారు. వీళ్ళు సుఖాన్ని ఇవ్వడానికి మాత్రమే వినియోగ పడతారు.

2) **పునర్భువు :** పెళ్ళయి కాపురం చేసుకొం టున్న స్త్రీ పరాయి పురుషుడితో సంబం ధాలు పెట్టుకున్నప్పుడు ఆమెని పునర్భువు అంటారు.

పెద్ద అధికారులు, ధనికులు, వ్యాపారుల ఉంపుడు గత్తెలు, అనేకమంది భార్యలున్న మగరాయుళ్ళ భార్యలు, కార్యసాధకురాళ్ళు స్పీడెక్కువ అనదగిన స్త్రీలూ, విధవలూ వీళ్ళలో పునర్భువు కాగల వారెక్కువగా వుండే అవకాశం వుంది.

**3) వేశ్య :** సుఖాన్ని అందివ్వడమే వృత్తిగా జీవించే స్త్రీ. కడుపుకక్కుర్తి కొద్దీ జీవితం సాగించడం కోసం తమదగ్గర ఉన్న ఒకేఒక ఆస్తి – బెత్తెడంత మానాన్ని పణంగా పెట్టి బతుకుతున్న అభాగ్యురాలు.

సురక్షితమైన, ఆరోగ్యవంతమైన కామప్రాప్తిని పొందడానికి ఈ మూడు రకాల స్త్రీలకూ సమాన హక్కుంది. ఎయిడ్స్ వ్యాధి స్త్రీలవలన వ్యాపిస్తుందనే ప్రచారంతో స్త్రీజాతి మీదకు నేరాన్ని నెట్టివేసే కుట్రచేస్తున్నారు మగవాళ్ళంతా! కానీ, ఆ ఆడదానికి ఎయిడ్స్‌ని అంటించింది ఈ "మగవాడే" నన్న సంగతి మరిచిపోకూడదు. కామప్రాప్తి ఆరోగ్యవంతంగానూ, సురక్షితంగానూ వుండాలనే విషయాన్ని ముఖ్యంగా స్త్రీలు మరిచిపోకూడదు.

## —— విటుడంటే ఎవరు ? ——

ఒకప్పుడు మంచి సంపదలున్నవాడే! ఉన్నదంతా వేశ్యలకే తగలేసి ఇప్పుడు బికారి రాముడిలా తిరుగుతున్నవాడుంటాడు చూశారూ..... వాడు ఇంత జరిగినా బుద్ధిగా ఇంటిపట్టున ఉంటాడనుకోవడం పొరపాటు. ఉంటే, బికారి ఎందుకౌతాడు.....? పెళ్ళాం బిడ్డల మంచిచెడ్డల గురించి ఆలోచించే సద్బుద్ధి వాడికుండదు. ఇలాంటివాడు నెమ్మదిగా గోష్ఠుల్లోకి ప్రవేశిస్తాడు. వినోద కార్యక్రమాల నిర్వాహకుడిగా రంగప్రవేశం చేస్తాడు. వినోదం కల్గించే ఆడవాళ్ళని ఉపయోగిస్తాడు. తనకింత లాభం ఉంచుకొని ఇతరులకింత సుఖం ఈ ఆడవాళ్ళద్వారా కల్గిస్తూ ఉంటాడు. ఇలా స్వేచ్ఛాచారిణులైన ఆడవాళ్ళని అనుసరించి బతుకుతూ వుండే వాణ్ణి విటుడంటారు.

## —— వికట కవులూ - విదూషక పాత్రలు ——

వినోద గోష్ఠుల్లో వినోదం ఇవ్వడానికి వికటకవులూ, విదూషకులూ ఉపయోగ పడతారు. సుఖం అందించడానికి స్త్రీలు సిద్ధంగా ఉంటారు. ఎమ్యూజ్‌మెంట్ పార్కులు ఇలాంటివే! ఇక్కడ వీళ్ళ వృత్తి నవ్విస్తూ ఉండటమే. ఇలాంటి విదూషకుల్లో కొందర్ని నమ్మకస్తులుగా పెట్టుకొని, వారిద్వారా నచ్చిన స్త్రీతో బేరాలు కుదుర్చుకునే ఏర్పాట్లు చేసుకొంటూ ఉంటారు. చివరికి ఈ విదూషక కళాకారులు, వికటకవులు ఇలా తార్పుడుగాళ్ళుగా దిగజారిపోతూ ఉంటారంటాడు వాత్స్యాయనుడు. వీళ్ళు వేశ్యలకు,

మంత్రులుగా వ్యవహరిస్తూ, కావలసిన వారితో సంధి సమకూర్చడానికి, వద్దనుకున్నవారితో విభేదాలు సృష్టించడానికి ఉపయోగపడ్తుంటారు. ఇలాంటి వారి విషయంలో జాగ్రత్తగా వుండమని మనల్ని కూడా హెచ్చరిస్తున్నాడు వాత్స్యాయనుడు.

## —— అక్రమ సంబంధాలకు ఇలాంటి కారణాలు ఉంటాయి ——

పరాయి వాడి భార్యతో అక్రమ సంబంధాలు పెట్టుకునే మనుషులంతా కేవలం సుఖం కోసమే ఈ పని చేస్తున్నారనుకోనవసరం లేదు. దీని వెనక చాలా కథ ఉంది.

1) తన గర్భశత్రువు ఎవరో ఆడదానితో అక్రమ సంబంధం పెట్టుకొంటే, దాన్ని చెడగొట్టి తనే ఆ సంబంధాన్ని ఆమెతో కొనసాగించాలని ఒకడు ప్రయత్నించవచ్చు.
2) ఆమెతో సంబంధం ద్వారా ఆమె భర్తని మంచి చేసుకోవచ్చునని ఈ విధంగా అతనికోసం ఆమెతో సంబంధం పెట్టుకొనేవాడొకడు.
3) తనకు అపకారం చేసే ఉద్దేశం వున్నవాడి భార్య మనసుని ఎలాగోలా జయించ గలిగితే, ఆమె ద్వారా ఆమె భర్త ధ్యాసని మళ్ళింపచేయవచ్చుననుకొనే వాడు మరొకడు.
4) ఆమెను పొందడం ద్వారా, ఆమె భర్త రహస్యాల్ని పొందవచ్చుననే ధ్యాసతో ప్రయత్నిస్తాడొకడు.
5) బాగా డబ్బున్నవాడి పెళ్ళాన్ని పట్టుకుంటే, ఎంతో కొంత ధనలాభం పొందవచ్చునని ఆశించేవాడొకడు.
6) తనను కోరి ఆమె స్వయంగా వచ్చినప్పుడు అంగీకరించకపోతే, తన భర్తకు లేనిపోనివన్నీ చెప్పి తనకు అపకారం కల్గించవచ్చునని భావించే వాడింకొకడు. కొందరు ఆఫీసర్ల పెళ్ళాలతో ఇలాంటి ఇబ్బందులు ఒక్కోసారి కలగవచ్చు. అనూహ్యమైన సౌఖ్యమూ పొందే అవకాశం కూడా కలగవచ్చు.
7) ఇప్పుడు తను కాదంటే, ఆవిడ తన శత్రువులతో సంబంధం పెట్టుకొనే ప్రమాదం వుందని భయపడికూడా ఇలాంటి సంబంధాలకు తలపడుతూ ఉంటారు.
8) ఆమెతో సంబంధం పెట్టుకొని, ఆమె భర్తమీద పరోక్షంగా కక్ష తీర్చుకోవాలని చూసేవాడు మరొకడు.
9) రాజుగారి వేగులు సాధారణంగా శత్రు రాజుల రాణివాసం వైపునుంచి కథను నడపడానికి ప్రయత్నిస్తారు.
10) ఈమెతో సంబంధం వలన ఈమె ద్వారా తను కోరుకునే స్త్రీని పరిచయం చేసుకోవడానికి అవకాశం ఉంటుందని ఆలోచించేవాడు మరొకడు.

ఇలా దుష్ట తలంపులు చేసేవాళ్ళు చాలామంది ఉంటారు. లైంగిక సంబంధాలనేవి గది నాలుగు గోడల మధ్య జరిగే వ్యవహారం కాబట్టి, బైటకు తెలిసే రహస్యాలు పరిమితంగా ఉంటాయి. అనుమానాలు, ఊహలు, పుకార్లు తప్ప అక్రమ సంబంధాలు బహిరంగంగా పట్టుబడేవి తక్కువ ఉంటాయి. ఈ అక్రమ సంబంధాలన్నీ "న కేవలం రాగా దేవేతి పర పరిగ్రహ గమన కారణాని" అంటే, కేవలం "అనురాగం"తోనే జరుగుతున్నాయనుకోవడం పొరబాటనీ, ఎవరి ప్రయోజనాలు వారికి ఉంటాయని, కానీ, అక్రమ సంబంధీకులు సంగమించిన ప్రతిసారీ ఒక సాహస కార్యం లాంటిదేననవలసి ఉంటుందనీ అంటాడు వాత్స్యాయన మహర్షి.

## —— ఇలాంటి వ్యక్తులతో సంబంధాలు పెట్టుకోకూడదు !! ——

ఇవ్వాళ ఎయిడ్స్ పెనుభూతం, నిన్నటిదాకా సిఫిలిస్ వంటి సుఖవ్యాధులు ఏర్పడ్డాయి కాబట్టి అక్రమ సంబంధాలు పెట్టుకునే వాళ్ళని బహిరంగంగానే హెచ్చరించవలసి వస్తోంది. ఈ వ్యాధులేవీ లేని రోజుల్లో కూడా వాత్స్యాయనుడు "దుష్ట స్త్రీ"ని పొందవద్దని చెప్పాడు.



దుష్ట స్త్రీ - అంటే ఎవరు? పొందదగని ఆడదాని గురించి వాత్స్యాయనుడు చెప్పింది పరిశీలిద్దాం. ఆడవాళ్ళకేనా ఈ నియమాలన్నీ అని అడిగితే, ఇవే విషయాలు మగవాళ్ళకూ వర్తిస్తాయనే అర్థం చేసుకోవాలి. దుష్ట స్త్రీ ఎంతో దుష్ట పురుషుడూ అంతే !!

1) చర్మవ్యాధులున్న వ్యక్తులతో సంబంధం పెట్టుకోకండి.

2) 'ఉన్మత్తా' పిచ్చివాళ్ళ జోలికి వెళ్ళకండి. సుఖం ఏదీ దొరక్కపోగా ప్రమాదం జరిగే అవకాశం ఉంది.

3) **పతిత :** కులభ్రష్టురాలు అంటే నడవడిక బాగోలేదని ఇంట్లోని అందరూ వెళ్ళగొట్టిన దాన్ని కూడా పొందాలని చూడకండి. అలాగే అలాంటి మగాడని తెలిస్తే వాణ్ణి దూరంగా ఉంచాలి ఆడవాళ్ళుకూడా.

4) **భిన్నరహస్యా :** ఆ వ్యక్తితో సంబంధం పెట్టుకుంటే తన రహస్యాన్ని దాచిపెట్టడం తెలీని వాడితో ఏ విధంగానూ సన్నిహితంగా వ్యవహరించకూడదు. ఊరంతా టాంటాం చేసిపారేస్తాడు.

5) **ప్రకాశ ప్రార్థినీ :** అంటే, ముందు తియ్యగా మాట్లాడి వెనకాల గోతులు తీసే మనస్తత్వం వున్న వ్యక్తుల్ని నమ్మి దగ్గర అవకూడదు. ఆడవారికైనా, మగవారికైనా ఇలాంటి వాళ్ళు నమ్మితేచాలు కాటువేస్తారు.

6) **గతప్రాయయౌవనా :** వయసుడిగిపోయిన వ్యక్తులతో అక్రమ లైంగిక సంబంధాలు ఉపయోగం లేకపోగా అల్లరయ్యేందుకు ఎక్కువ అవకాశాలుంటాయి.

7) **అతిశ్వేతా :** బాగా తెల్లగా వుండే వ్యక్తులతోనూ,

8) **అతికృష్ణా :** అతినల్లగా వుండే వ్యక్తులతోనూ లైంగిక సంబంధాలు వద్దని చెప్పాడు వాత్స్యాయనుడు. బహుశా అతితెలుపు, అతినలుపు అనే పదాలు బొల్లి, ఎగ్జిమా, సొరియాసిస్ వంటి చర్మవ్యాధులున్న వ్యక్తుల గురించి అని వుంటాడని వూహించవచ్చును కొంటాను.

9) **దుర్గంధా :** దగ్గరకు వెళితే కంపుకొట్టే వాళ్ళతో సంబంధం పెట్టుకుంటే ఏం సుఖంగా వుంటుందీ ? అందుకే వద్దన్నాడు. పైగా ఈ దుర్గంధం ఏ వ్యాధులు కల్గిస్తుందో తెలియదు కదా!!

10) **సంబంధినీ :** దగ్గర చుట్టాల్లో ఎవ్వరితోనూ అక్రమ సంబంధాల గురించి ప్రయత్నం చెయ్యడం మంచిది కాదంటాడు వాత్స్యాయనుడు. ఒకవేళ వ్యవహారం బెడిసికొడితే, మర్నాటి నుంచి ఒకరినొకరు ముఖం ముఖం చూసుకోవాలంటే ఇబ్బందిగా వుంటుంది కదా!!

11) **సఖి :** భార్యకు సన్నిహితురాలిగా వుండే వ్యక్తితోగాని, భర్తకు స్నేహితుడైన వ్యక్తితోగాని స్త్రీ పురుషులు అక్రమ సంబంధాలు పెట్టుకోకూడదు. ఏ బలహీన క్షణంలోనో విషయం అవతలివాళ్లకు చేరవేసే ప్రమాదం ఉంటుంది.

**12)** **ప్రవ్రజితా :** సన్యాసులు, దేవుళ్ళుగా చెలామణి అయ్యే వ్యక్తులు, పురాణాలు చెప్పుకు బ్రతికే వాళ్ళతో అక్రమ సంబంధాలు కూడా అనర్థ హేతువేనంటాడు వాత్స్యాయనుడు. పాపభీతి వెన్నాడుతుందని కావచ్చు. అలాగే -

**13)** **శ్రోత్రియ :** బ్రాహ్మణుడు, పురోహితుడు, పూజారి - వీరి భార్యలతో కూడా సంబంధం వద్దని గట్టిగా చెప్పాడు, బహుశా ఈ కారణంతోనే.

**14)** **సంబంధినీ సఖీ :** తనతో వ్యాపారంలో భాగస్వాములు, తనతో కలిసి పనిచేసేవాళ్ళు..... ఇలాంటి స్త్రీ, పురుషులు ఒకరితో నొకరు అక్రమ లైంగిక సంబంధం కోసం ప్రయత్నించడం మంచిది కాదు. ఎందుకంటే, అందుకోసం ఒకరుచేసే ప్రయత్నాన్ని రెండో వ్యక్తి అంగీకరించకపోతే అసలుకే మోసం వచ్చి వృత్తి వ్యాపారాలు దెబ్బతింటాయి. అలాగే తమ వ్యాపారంలో వచ్చే ఖాతాదార్లు కూడా ఇలాంటి సంబంధ సుఖులే అవుతారు. కష్టమర్లను మంచి చేసుకొని వ్యాపారం పెంచుకోవడం తెలివైనవాడి లక్షణం. ఈ మంచి చేసుకోవడంలో మరో అడుగు ముందుకెళ్ళి ఏకంగా ఆ వ్యక్తులతో అక్రమ సంబంధం పెట్టుకోదలిస్తే మాత్రం, ఆ తర్వాత వ్యాపారం గుండు గీకినట్లయిపోతుంది.

**15)** **రాజదార :** రాజుగారి భార్యమీద మాత్రం కన్నేయకండి. కొడితే ఏనుగు కుంభస్థలాన్నే కొట్టాలని దుస్సాహసాలు చేసి జై పాతాళభైరవి అనేద్దామని చూడకండి. సినిమాలు వేరు - జీవితం వేరు.

## —— స్త్రీ, పురుష జననాంగాల పరిమాణం ——

దేన్ని చూసి వీడు మగ, ఇది ఆడ అని మనం నిర్ణయిస్తామో దాన్ని 'లింగం' అంటారు. పుల్లింగం పొడవుగా ముందుకు సాగి, స్త్రీ లింగం లోపలికి లోతుగానూ వుంటాయి. ఇప్పుడు మనం వాటి కొలతలు వివరాలు తెలుసుకోబోతున్నాం.

1) లింగం పొడుగును బట్టి మగవాళ్ళు మూడురకాలు.

పొట్టిదిగా చిన్నదిగా లింగం వున్న మగవాణ్ణి శశజాతి పురుషుడు అంటారు.

మధ్యమంగా లింగం వున్న మగవాణ్ణి వృషజాతి పురుషుడంటారు.

మరీ ఎక్కువ పొడుగుగా లింగం వున్న మగవాణ్ణి అశ్వజాతి పురుషుడంటారు.

2) లింగం లోతును బట్టి ఆడవాళ్ళు కూడా మూడు రకాలు.

లోతు తక్కువ జననాంగం వున్న స్త్రీని మృగి అంటారు.

మధ్యమంగా వున్న స్త్రీని 'బడబ' అంటారు.

మరీ ఎక్కువ లోతుగా వుంటే హస్తిని అంటారు.

3) స్తంభించిన స్థితిలో శశజాతి పురుషుడి అవయవం ఆరంగుళాల వరకూ ఉంటుంది. మృగి జాతి స్త్రీ జననాంగం కూడా ఆరంగుళాల లోతు కలిగి ఉంటుంది.

4) వృషజాతి పురుషుడి, బడబ జాతి స్త్రీల జననాంగాలు 9 అంగుళాలుంటాయి.

5) అశ్వజాతి పురుషుడికి, హస్తిని జాతి స్త్రీకి పన్నెండంగుళాల వరకూ జననాంగం వుండవచ్చు.

ఇది వాత్స్యాయనుడు నిర్ణయించిన విధానం. ఈ విధమైన స్త్రీ పురుషులు, తమ జననాంగాల పొడుగు లోతుల్లో సమానమైన కొలతలు కల్గిన వారు సమానమైన సంతృప్తి పొందుతారు..... అంటాడు. దానికి "సమరతం" అని పేరుపెట్టాడు. అందుకు వ్యతిరేకంగా వుంటే విషమరతి అన్నాడు.

నిజమే! కానీ, జంటకట్టే వారు జననాంగం పొడుగునీ, లోతునీ కొలిచి జీవిత భాగస్వామ్యం నిర్ణయించుకోగలగడం సాధ్యమా? అందుకే, మనస్తత్వాన్ని బట్టి, రూపురేఖా విలాసాల్ని బట్టి తనకు తగిన స్త్రీని మగవాడు, తనకు తగిన మగవాణ్ణి స్త్రీ ఎంచుకోవడం కోసం కొన్ని మార్గదర్శక సూత్రాలు కామశాస్త్రంలో చెప్పడం జరిగింది.

"కొక్కోకం" అనే మరో కామశాస్త్ర గ్రంథంలో రూపురేఖా విలాసాలనుబట్టి ఆమె మనస్తత్వాన్ని, ఆమె రతి సమర్థతనీ అంచనా వేసుకోవచ్చని పేర్కొన్నారు. అందుకోసం ఆడవాళ్ళని నాలుగు జాతులుగా విభజించారు. (1) పద్మినీ జాతి స్త్రీ, (2) చిత్రిణీ జాతి స్త్రీ, (3) శంఖిణీ జాతి స్త్రీ, (4) హస్తినీ జాతి స్త్రీ అని వారికి పేర్లు పెట్టాడు. ఈ స్త్రీల వివరాలు చదివినప్పుడు ఇవే లక్షణాలు మగవాళ్ళలో కూడా కన్పించవచ్చు. వాటి ఊహ ఆధారంగానే స్త్రీ పురుషులు తమ జీవిత భాగస్వాముల్ని ఎంచుకోవచ్చని కొక్కోకుని ఆంతర్యం కావచ్చు.

నవ్వే మల్లె పువ్వులాగా సత్యభాషిణిగా వుండే పద్మినీ జాతి స్త్రీకి అలాంటి పురుషుడే తగిన భర్త అవుతాడు. చంకల్లోంచి గబ్బు కంపుకొట్టే మగవాడు ఆమె సమీపంలోకి వెళ్ళడానికి కూడా అర్హుడు కాలేదు కదా..... అలాంటి గబ్బు కంపు మగాడికి హస్తినీ జాతి స్త్రీ సమజోడి అవుతుంది. ఎందుకంటే, ఆమెకూడా అలానే వుంటుంది కాబట్టి. ఇలా ఎవరికి వాళ్ళు తమ జీవిత భాగస్వాముల్ని ఎంపిక చేసుకోవడం కోసమే ఈ నాలుగు రకాల స్త్రీ జాతుల వివరాలు ఇస్తున్నారు. చదవండి! అధ్యయనం చేస్తే ఖచ్చితమైన నిర్ణయం తీసుకోగలిగే శక్తి కల్గుతుంది.

## —— పద్మినీ జాతి స్త్రీ - పాంచాల జాతి పురుషుడు ——

1) పద్మినీ జాతి స్త్రీ శరీరం మంచి ఒడ్డూ పొడుగూ వుండి, మెత్తగా తామర మొగ్గలాగా ఉంటుంది ! పద్మంలాగా ఉంటుంది కాబట్టి 'పద్మిని' అన్నారు. జననాంగం తామర మొగ్గ ఆకారంలో లోతుగా వుంటుంది.
2) శరీరంలోంచి కమ్మని సుగంధం వస్తుంది. జననాంగం నుంచి కూడా అలాంటి సుగంధమే కలుగుతుంది.
3) కళ్ళు తళతళా మెరుస్తుంటాయి. ముక్కు నువ్వు పువ్వులా అందంగా ఉంటుంది. స్తనాలు మారేడు పండ్ల ఆకారంలో ఉంటాయి.
4) గురుదేవతా పూజల్లో ఎక్కువ శ్రద్ధ చూపుతుంది. తియ్యగా మాట్లాడుతుంది.
5) నవ్వురాజిల్లెడు మోము - అతి సన్నని నడుము. హంసలాంటి నడక.
6) చాలా తక్కువ భుజిస్తుంది. పరిశుభ్రమైన ఆహారమే తీసుకొంటుంది.
7) ఎప్పుడూ నిజమే పలుకుతుంది. నిజాయితి కలిగి వుంటుంది. ధర్మబుద్ధి పరురాలు.
8) ఎర్రని పెదాలు, మెత్తనైన చేతులు, చిలుక పలుకులు.
9) అలంకార ప్రియత్వం ఎక్కువ.
10) రతిలో ఎక్కువ ఆనందాన్ని పొందుతుంది. ఎక్కువ ప్రతిస్పందిస్తుంది.
11) తెల్లవారుఝూమున రతిని కోరుతుంది. రమించడానికి యోగ్యమైన స్త్రీ.
12) ఇలాంటి లక్షణాలే వున్న ఈమెకి తగిన మగవాణ్ణి "పాంచాల జాతి" పురుషుడు అంటారు. పద్మినీ జాతి స్త్రీకి పాంచాలజాతి పురుషుడితో కలయిక సమరతి అనిపించుకొంటుంది.

## —— చిత్రిణీ జాతి స్త్రీ - కూచిమార జాతి పురుషుడు ——

1) చిత్రిణీ జాతి స్త్రీలు సన్నగా వుంటారు. అభిమానపూర్వకంగా ప్రవర్తిస్తారు.
2) పెద్ద స్తనాలు, పెద్ద పిరుదులూ వుంటాయి.
3) పిక్కలు కూడా పెద్దవిగా వుంటాయి. కంఠం శంఖంలా వుంటుంది.
4) కొద్దిపాటి దుర్వాసనగా వుంటుంది జననాంగం.
5) జననాంగం దగ్గర రోమాలు పలుచగా వుంటాయి.
6) పులుపు వస్తువులు ఎక్కువ ఇష్టపడుతుంది.
7) రంగురంగుల చీరలంటే ఎక్కువ మోజుపడ్తుంది.

8) తక్కువకాకుండా, ఎక్కువకాకుండా మధ్యరకంగా భోజనం చేస్తుంది.

9) సుగంధపు మైపూతలంటే ఇష్టపడుతుంది.

10) ముంగురులు ఉంగరాలు తిరిగి వుంటాయి.

11) తక్కువ కోపం ప్రదర్శిస్తుంది. కాని, ఎవ్వరిని గట్టిగా ప్రేమించదు. చపలత్వం ఎక్కువ. మనసు కొత్తదనాన్ని కోరుతుంది. చిత్రిణి అంటే, అందగాళ్ళకు తంగేడు చెట్టున వున్న జున్నులాంటిదనీ, చేతికి తేలికగా అందుతుందనీ వ్యాఖ్యాతలంటారు. భర్తను తిడుతూ పరాయి మగాడి పొందు కోరుతుంది.

12) చమత్కారంగా మాట్లాడుతుంది. తియ్యగా ఆకర్షిస్తుంది. ఇలాంటి స్త్రీ రాత్రి పదిలోపే రతిని కోరుతుంది. కూచిమారుడనే నాయకుడు సమాన జోడుగా వుంటాడని కొక్కోక శాస్త్రంలో పేర్కొన్నారు. అంటే కూచిమారుడు కూడా ఇలాంటి స్వభావాన్నే కలిగి వుంటాడన్నమాట.

## —— శంఖిణీ జాతి స్త్రీ - శశాంక జాతి పురుషుడు ——

1) శంఖిణీ జాతి స్త్రీ ఒడ్డూ పొడుగూ బలుపూ వున్న దేహంతో, పెద్దపెద్ద పాదాలతో భారీగా కన్పిస్తుంది.

2) కోపం ఎక్కువ. ఎంతమాటైనా అనటానికి జంకదు.

3) బాగా దట్టంగా జననాంగం దగ్గర వెంట్రుకలుంటాయి. గోళ్లతో గిల్లడానికి, కొరకడానికి ఎక్కువ ఇష్టపడ్తుంది.

4) తేలికపాటి ఆహారం తీసుకొంటుంది. శ్రావ్యమైన కంఠం కాదు. వినసొంపుగా వుండదు.

5) శరీరంలో మెత్తదనం తక్కువ. పాదాలను చూస్తే మగవాడి పాదాలు మాదిరిగా వుంటాయి.

6) నమ్మితే వెర్రి నమ్మకాన్ని పెంచుకొంటుంది.

7) కారం ఎక్కువగా తింటుంది. అలాగే భర్త మీద కారాలూ మిరియాలు నూరుతుంది. కానీ, ఎంతకోపగించినా చివరికి రతి సుఖాన్నే కోరుకొంటుంది. పురుషాయితం కోసం వెంపర్లాడుతుంది.

8) ఇలాంటి స్త్రీలకు శశాంక జాతి పురుషుడు తగిన జోడుగా ఉంటాడు. మగవాళ్ళలో ఇలాంటి మనస్తత్వం రూపురేఖా విలాసాల్ని కల్గిన వ్యక్తుల్ని శశాంక జాతి పురుషులంటారు.

## —— హస్తినీ జాతి స్త్రీ.... ——

1) తిన్నగా నడవదు. వేళ్లు వంకర తిరిగి వుంటాయి.
2) క్రూరస్వభావం ఎక్కువ. చిన్న విషయానికి పెద్ద గోలని సృష్టిస్తుంది.
3) పొట్టి శరీరం, చెమటవాసన ఎక్కువ.
4) తిండిపోతు. నిర్మొహమాటంగా వుంటుంది తిండి విషయంలో.
5) ఘోరమైన కంఠం, వెడల్పయిన నోరు.
6) ఒక్క పట్టాన దేనికీ సంతృప్తి చెందదు – రతి విషయంలో కూడా.
7) మనసు మృదువు. చిన్న విషయాలకే తేలికగా హర్ట్ అవుతారు. ఊరికే గొడవ పెట్టుకుంటారు.
8) నడుమూ, తొడలూ బరువెక్కువ. పెద్ద పొట్ట.
9) రెండో ఝాములో రతిని కోరుతుంది. ఎంత సుఖపెడితే అంత ప్రేమిస్తుంది.
10) లైంగిక విషయాల మీద పెద్దగా ఆసక్తి లేనిదానిలా పైకి కన్పిస్తుంది.
11) బాగా అందమైన విలాసపురుషుల వంక సొంపుగా చూస్తుంది.
12) ఆలింగనాన్ని ఎక్కువగా కోరుతుంది.

## —— "రతి" అంటే.....? ——

స్త్రీ పురుషులు ఒంటరిగా చేరువయినప్పుడు కల్గిన కోరికని కామితం (LIBIDO) అంటారు. కామితం కల్గినప్పుడు జననాంగాలలో కలిగే స్తంభన, మనసులో చెలరేగే ఉద్వేగాల్ని భావప్రాప్తి (TUMESCENSE) అనీ, స్ఖలనం అవుతున్న దశలో కలిగే అనుభూతిని ఫలసిద్ధి పూర్వకమైన భావం (DETUMESCENSE) అని అంటారు.

ఈ మొత్తం ప్రక్రియనే 'రతి' అంటారు. ఇందులో కామితాన్నీ, భావప్రాప్తినీ ఎక్కువసేపు పొందగలిగేలా ప్రయత్నించమంటాడు వాత్స్యాయనుడు.

## —— రతి మూడు స్థాయిల్లో ఉంటుంది ——

కామితం కల్గినప్పటి నుంచి భావఫలసిద్ధి కలిగి ముగించే వరకూ నడిచే రతి కార్యం – ఆయా వ్యక్తుల శారీరక స్థితినీ, మానసిక స్థితినీ, రతి జరుగుతున్న పరిస్థితిని బట్టి మూడు స్థాయిల్లో వుంటుంది.

1) **మృదు రతి :** ఈ స్థితిలో సంగమ ఉత్సాహం తక్కువగా వుంటుంది. ఉత్తేజం కూడా తక్కువగా వుంటుంది. మగవారికైనా ఆడవారికైనా ఈ పరిస్థితి వుండొచ్చు. వీర్యం అల్పంగా విడుదల అవుతుంది. ఒక్కోసారి అసలు విడుదల కాకపోవచ్చు.

దీని అర్థం ఇలాంటి స్థితిలో వున్న వ్యక్తులు సంగమానికి అర్హులు కారని అనడం కాదు. అనేక మందిలో మానసిక అంశాలు ఈ రకమైన "మృదురతి" స్థితిని తెచ్చిపెట్టవచ్చు. ఈ స్థితిలో వున్న పురుషుణ్ణి మృదువేగుదు అనీ, స్త్రీని "మృదువేగి" అని అంటారు.

2) **మధ్యమ రతి :** "తద్విపర్యయే మధ్యమచండ వేగౌభవతః" అంటే మృదురతి స్థితికి వ్యతిరేకమైన స్థితిని 'మధ్యమ రతి' అంటారని చెప్పాడు వాత్స్యాయనుడు. సంగమించాలనే కోరిక, ఉత్సాహము, వీర్యం కూడా మధ్యమంగా వుంటాయి. మరీ తక్కువగా కాకుండా, మరీ ఎక్కువకాకుండా వుంటాయి. ఇవి ఎంత ఎక్కువ వుంటే అంత తృప్తి కాబట్టి ఇందులో 'సమస్థితి' అనేది వుండదు. అందుకే 'మధ్యమరతి' అన్నాడు. రతి సమయంలో గోటి నొక్కులు, పంటి గాట్లు.....వీటికి మధ్యమంగా తట్టుకోగలుగుతారు. మృదురతిలో అస్సలు తట్టుకోలేరు. ఇదీ తేడా. ఈ స్థితిలో వున్న పురుషుణ్ణి "'మధ్య వేగుదు" అనీ స్త్రీని "మధ్యవేగి" అని అంటారు.

3) **అధికం :** అన్నిట్లోనూ అధిక స్థితి ఉంటుంది. ఉత్సాహ ఉత్తేజాలు అవధిమారి వుంటాయి. ఇలాంటి స్థితిలో వున్న పురుషుణ్ణి "చండ వేగుదు" అనీ, స్త్రీని "చండ వేగి" అనీ పిలుస్తారు.

## —— రతిలో సమస్థితి పొందడానికి ఓ ఉపాయం ——

'భావ ప్రాప్తి' సమయాన్ని (TUMESCENSE) అసలైన రతి జరుగుతున్న మయంగా చెప్తారు.



ఇది స్వల్పకాలం వున్నప్పుడు పురుషుడుకి శీఘ్రంగా స్ఖలనం అయిపోతుంది. స్త్రీకి త్వరగా 'ఇంక చాలు' అనిపిస్తుంది. శీఘ్రంగా ముగించవలసివచ్చే ఈ స్థితిలో వున్న స్త్రీ పురుషుల్ని "శీఘ్ర వేగులు" అంటారు. మధ్యరకంగా ముగించేవారిని మధ్యవేగులు అంటారు. ఎక్కువ సమయం తర్వాత ముగించగలిగే స్థితిని కల్గిన స్త్రీ పురుషుల్ని 'చిర వేగులు' అంటారు.

ఇక్కడ అసలు విషయం ఏమంటే, శీఘ్రంగా ముగించే పురుషుడు, ఆలస్యంగా ముగించే స్త్రీతో సంగమిస్తే అసంతృప్తే మిగుల్తుంది కదా..... అందుకని సంగమించే స్త్రీ పురుషులిద్దరి మధ్య "సమస్థితి" వుండాలనేది ముఖ్యం!!

ఈ సమస్థితి ఎప్పుడు సాధ్యం అవుతుందంటే, స్త్రీ తనకన్నా ముందే సంతృప్తి చెందేలా ఉపాయంతో పురుషుడు రతి చెయ్యగలిగినప్పుడు మాత్రమే!

"జాతే రభేదాద్దంపత్యోః" అన్నాడు వాత్స్యాయనుడు. స్త్రీ పురుషులు సంగమిస్తున్నప్పుడు స్త్రీలకు ఎక్కువ సుఖం, పురుషులకు తక్కువ సుఖం ఇలాంటి జాతి భేదాలుండవు. సుఖం, సంతృప్తి అనేవి ఇద్దరికి సమానంగా కలిగితేనే అది "సమరతి" అవుతుంది. దీన్ని "ఉత్తమ రతి" అంటారు. అలా కాకుండా పురుషుడికి ముందుగా సంతృప్తి కల్గినప్పుడు అతని జననాంగం బిగువును కోల్పోతుంది. ఒక్కోసారి బిగువు నిలబడి వుంటుంది గానీ, కోరిక నిలబడకపోవచ్చు. ఇంక చాలు అని త్వరగా ముగించేలా చేస్తుంది.

ముందుగానే ముగిసిపోయే మగవాళ్ళకు వాత్స్యాయనుడు ఒక ఉపాయం చెప్పాడు.

ముందుగానే ముగించవలసి వచ్చిన పరిస్థితుల్లో మగవాడు తను సంగమించే స్త్రీని ముద్దులతోటీ, ఆలింగనాలతోటీ, ఇంకా ఇతర శృంగార చేష్టలతోటీ ఉపచరించి, తనకన్నా ముందుగానే అమెకు భావప్రాప్తి అంటే సంతృప్తి (DETUMESCENSE) కలిగేలా చూడాలి. స్త్రీ భావప్రాప్తి పొందడాన్ని అనుసరించి పురుషుడు తన వేగాన్ని కొనసాగించాలి. అప్పుడు పురుషుడు కూడా అదే సమయానికి భావప్రాప్తి పొందుతాడు. ఆ విధంగా ఆ యిద్దరిదీ 'సమరతి' అవుతుంది.

## —— మొదటిసారి రతికి రెండోసారి రతికీ తేడా ఉంటుంది! ——

సాధారణంగా మొదటి రతిలో పురుషుడికి ఎక్కువ ఉత్సాహం ఉంటుంది. అలాగే త్వరగా స్ఖలనం అయిపోయి ముందుగానే ముగించే స్థితి వస్తుంది. చాలా కాలం వ్యవధి ఏర్పడిన తర్వాత మొదటిసారి సంగమించే పురుషుడికి కూడా త్వరగా ముగింపు కలుగు తుంటుంది. కలగవచ్చు, కలిగి తీరాలనేది లేదు.

ఒకే పూట రెండోసారి రతికి తలపడినప్పుడు మగవాడిలో ఉత్సాహం తక్కువగా వుంటుంది. కానీ, ఆలస్యంగా స్ఖలనం అవుతుంది. ఇదే, స్త్రీల విషయంలో ఇందుకు వ్యతిరేకంగా జరుగుతుంది. స్త్రీలకు మొదటి రతిలో ఉత్సాహం కొద్దిగా వుండి ఆలస్యంగా భావప్రాప్తి అవుతుంది. కానీ, రెండోసారి రతిలో ఉత్సాహం ఎక్కువగా వుండి త్వరగా భావప్రాప్తి కల్గుతుంది అంటాడు వాత్స్యాయనుడు.

ఇలా ధాతువు (వీర్యం) క్షీణించేవరకూ, ఉత్సాహనిరుత్సాహాలు, శీఘ్రస్ఖలనాలు, చిరస్ఖలనాలు సరిచేసుకొంటూ పురుషుడు రతిని కొనసాగించాలి.

## —— సంతృప్తిని కొనసాగింపచేయడం ఎలా ? ——

స్త్రీ కంటే ముందే పురుషుడు ముగించేస్తాడనీ, స్త్రీలకు ముగించడం అంటూ వుండదనీ చాలామందిలో వున్న ఒక అపనమ్మకం. 'రతి' అనేది స్త్రీ పురుషులిద్దరి మధ్య సమానంగా ఇచ్చిపుచ్చుకొనే ఒక కార్యక్రమం. ఇద్దరూ ఒకరినొకరు సుఖాల్ని ఇచ్చుకొంటారు. సుఖాన్ని ఇవ్వడం ద్వారానే సంతృప్తి చెందుతారు. 'సంతృప్తి' అనేది రతిలో ముఖ్యమైన విషయం. అది కలగనప్పుడు ఆ ఇద్దరి మధ్యన జరిగింది రతి కార్యం అనిపించుకోదు. వాత్స్యాయనుడు ఈ సంతృప్తిని "ప్రీతి" అన్నాడు. ప్రీతిని ఎక్కువగా పొందాలంటే అందుకు అభ్యాసం (PRACTICE) కావాలి. ఆ ఇద్దరికీ ఒకరిమీద ఒకరికి అభిమానం జనించాలి. ఒకరిమీద ఇంకొకరికి మనసులో చాలా ఉన్నతమైన అభిప్రాయం వుండాలి. ఇంకా అనేక విశేషాలు కావాలి.

## —— ప్రేమను వ్యక్తపరిచే మార్గాలు ——

1) అమ్మాయి ఎదురుగా వస్తోంది. అబ్బాయి ఏదో పనిమీద హడావిడిగా వెళ్తున్నవాడిలా పక్కనే రాసుకొంటూ భుజానికి ఢీ కొట్టడం తన మనసులో ప్రేమని వెళ్ళగక్కే మార్గాల్లో ఒకటి. దీనివలన ఆ మ్మాయిక్కూడా ఒళ్ళు జలదరించిందనుకోండి – ప్రేమ ఫలిస్తుంది. లేకపోతే ఏదో చూడక తగిలినట్లుగా 'సారీ' అనుకొంటూ తప్పుకోవచ్చు. ఏ మాత్రం చాకచక్యం లేకుండా ఈ పనిచేస్తే చెంపదెబ్బతిని వీధిలో అల్లరి అయ్యే పరిస్థితి రావచ్చు. జాగ్రత్త ! ప్రేమను వ్యక్తపరిచే ఈ మార్గానికి వాత్స్యాయనుడు పెట్టిన పేరు "స్పృష్టకం" అని !

2) జన సంచారంలేని చోట ఒంటరిగా నిలబడిన అబ్బాయిని ఒక ఆడపిల్ల ఏదో వస్తువు అందుకొంటున్న దానిలా – తన రొమ్ములతో కుమ్మి జాగ్రత్తగా పక్కకు

తప్పుకొన్నదనుకోండి - దీన్ని "విద్ధకం" అంటారు. ఎవరూ చూడలేదని నిర్ధారించుకొని అబ్బాయి కూడా తగిన రీతిలో ప్రతిస్పందిస్తే తన అంగీకారం తెలిపినట్టే అవుతుంది.

ఈ అబ్బాయి అమ్మాయిలు ఎవరో కొత్తవాళ్ళు, అపరిచితులు అనుకొని అపార్థం చేసుకోకండి..... ఇది కొత్తగా పెళ్ళి అయి, ఇంకా కాపురానికి రాని స్థితిలో ఉన్న అబ్బాయిలూ అమ్మాయిలూ ఒకళ్ళనొకరు పలకరించుకొనేందుకు ఉపాయాలు చెప్పాడు. పాత పరిచయస్థులు కూడా, కొత్తగా లైంగికపరమైన అభిప్రాయాన్ని వ్యక్తపరచడానికి ఈ ఉపాయాలు బాగా ఉపయోగపడతాయి.

3) జనం లేని చోట, ఏకాంత స్థలంలో అమ్మాయి, అబ్బాయి వంటరిగా కలుసు కోగలిగి నప్పుడు ఒకరినొకరు అనుకొని శరీరాలు రాసుకొంటూ నిలబడిగాని, నడుస్తూగాని, కూర్చొని గాని కబుర్లు చెప్పుకోవడాన్ని "ఉద్ఘర్షయ" అంటారు.

4) మరింత దగ్గరగా జరిగి, ఇంచు మించుగా కౌగిలించుకున్నంత గట్టిగా రాసుకోవడాన్ని "ఉద్ఘృష్టకం" అంటారు.

5) అలా ఓ గోడకు గాని, తలుపుకు గాని, బీరువాకి గాని, చెట్టుకు గాని ఆను కొని గట్టిగా అదుముకోవడాన్ని "స్ఫుటకం" అన్నాడు వాత్స్యాయనుడు.



ఇలా ఈ చివరి మూడు అంశాలు - రాసుకొనేవి, అదుముకొనేవీ, అదిమిపట్టేవీ కేవలం పరిచయం అయిన వ్యక్తుల మధ్య ప్రేమను బలపరచుకోవడానికి జరిపే సన్నివేశాలు. ఇలా చేస్తే అవతలి వ్యక్తి ఎలా ప్రతిస్పందిస్తారోనని భయపడనవసరంలేని స్థితిలో ఇద్దరి మధ్య ప్రేమతో కూడిన అంగీకారం వున్న అమ్మాయి, అబ్బాయి, తమ ప్రేమను అభివృద్ధి పరచుకోవడానికి చేసే చర్యలు. "పెట్టింగ్" అంటారు ఈ చర్యని ఆధునిక భాషలో !

## —— కౌగిలింతలు నాలుగు రకాలు ——

అబ్బాయి, అమ్మాయి మధ్య ప్రేమ ముదిరిన తర్వాత కౌగిలింతలదాకా వస్తుంది పరిస్థితి. రతికన్నా ముందుగా జరిపే ఈ చర్యని "ఆలింగనం" అంటారు. ఆలింగనాలని నాలుగు రకాలుగా పేర్కొన్నాడు వాత్స్యాయనుడు.

ఇందులో అమ్మాయి ఇచ్చే కౌగిలింతలు రెండురకాలు. అమ్మాయి, అబ్బాయి ఇద్దరూ కలిసి ఒకరికొకరు ఇచ్చుకునే కౌగిలింతలు రెండురకాలు. మొదటగా అమ్మాయిలు ఇచ్చే కౌగిలింతల గురించి పరిశీలిద్దాం.

ఎ) తీగపొద చెట్టును చుట్టినట్టు అమ్మాయి అబ్బాయిని ఎదురుగా కౌగిలించుకొని ఎగబాకుతూ ఇచ్చే కౌగిలింత..... ! అతని ముఖాన్ని కిందకు వంచి, తాను కిందనుంచి మీదకు ఎగబాకుతూ, నిలబడి, బాగా హత్తుకొని, నెమ్మదిగా 'ఆఁ .....హా.....' లాంటి శబ్దాలు చేస్తూ, తన ప్రేమను, ఆనందాన్ని, సంతృప్తినీ వ్యక్తపరుస్తూ తన ప్రియుడికి సుఖానుభవాన్ని కల్గించే ప్రక్రియని "లతావేష్టితం" అనే కౌగిలింతగా చెప్పాడు వాత్స్యాయనుడు.

బి) అమ్మాయి అబ్బాయికి ఇచ్చే మరో అతిగాఢమైన కౌగిలింత ఇది! దీన్ని వృక్షాధిరూఢకం అన్నాడు. దీని పేరుని బట్టి ఈ కౌగిలింత ఎలా ఉంటుందో అర్థం అయిపోతుంది. 'వృక్షాధిరూఢం' అంటే చెట్టునెక్కడం అని ! ప్రియుడి ఎదురుగా నిలుచుని ఒకచెట్టుపైకి ఎక్కినట్లు ఒక కాలితో అతని పాదాన్ని తొక్కిపట్టి, రెండో కాలితో అతని తొడమీదుగా నడుమును చుట్టుకోవడాన్ని "వృక్షాధిరూఢకం" అన్నాడు. ఈ బిగికౌగిలింతలో స్త్రీ, పురుషుల శరీరాలు ఏకమై ప్రేమాధిక్యం కల్గుతుంది అంటాడు వాత్స్యాయనుడు. ఒక కాలితో నడుమును పెనవేసుకొని, రెండుచేతుల్తో అతని ముఖాన్ని తన ముఖందాకా ముందుకు వంచి ముద్దు పెట్టుకోవడానికి ప్రయత్నించే దృశ్యం చెట్టెక్కే తీరులోనే ఉంటుంది. అందుకని వృక్షాధిరూఢకం అన్నాడు.

సి) ఇప్పుడు అమ్మాయి, అబ్బాయి పడుకొని ఒకరినొకరు ఇచ్చుకునే కౌగిలింత తిలతండులకం గురించి చెప్తున్నాడు. వడ్లగింజ, నువ్వుగింజలాగా కలిసిపోవడం తిలతండులకం. అమ్మాయి, అబ్బాయి ఒకరివైపుకు ఇంకొకరు ఎదురు ఒత్తిగిలి పడుకొంటారు! ఒకరి తొడతో ఇంకొకరిని ఒకరిచేతుల్తో ఇంకొకరినీ గట్టిగా బిగువుగా కౌగిలించుకొని పడుకున్నప్పుడు ఈ కౌగిలింతని వాత్స్యాయనుడు తిలతండులకం అని పిలిచాడు.

**డి) కౌగిలింతల్లో అత్యంత గాఢమైన మరో కౌగిలింతని చెప్తున్నాడు! సుకుమారులు ఈ కౌగిలింతకు తట్టుకోలేకపోవచ్చు. ఇద్దరూ సమానమైన శరీర సంపత్తులున్న**

స్త్రీ పురుషులు ఎముకలు విరిగేంత ఘాటుగా ఒడిలో కూర్చోబెట్టుకొని గాని, ఎదురెదురుగా కూర్చొని గాని, పడుకుని గాని, నిలబడి గాని అమిత గాఢంగా కౌగిలించుకోవడాన్ని క్షీర జలకం అన్నాడు వాత్స్యాయనుడు. అంటే, పాలూ నీళ్ళులా కలిసిపోయి కౌగిలింత పారవశ్యంలో కరిగిపోవాలన్నమాట !!

ఈ చివరి రెండు కౌగిలింతలు రతికి తలపడబోయే ముందు ఇచ్చే "ఫైనల్ టచ్" వంటివి. "తదుభయం రాగకాలే" అన్నాడు. అంటే, ఈ కౌగిలింత తర్వాత ఇంక ఆపుకోలేని స్థితిలో మన్మథావస్థకు లోనై రతికి తలపడడం జరుగుతుంది కాబట్టి, అటువంటి "రాగ కాలం"లో చేసే ఆలింగనం అని అర్థం. మొదటి రెండూ అమ్మాయి అబ్బాయిలో చలనం కలిగించడానికి ఇచ్చే కౌగిలింతలు. చివరి రెండూ అబ్బాయి, అమ్మాయి ఒకరినొకరు ఉత్తేజితుల్ని చేసుకోవడానికి ఇచ్చే కౌగిలింతలు. "బాభ్రవ్యుడు" అనే కామశాస్త్రవేత్త చెప్పినవి ఈ నాలుగు ఆలింగన విధానాలు.

## —— మరికొన్ని ఆలింగనాలు ——

కౌగిలించుకోవడం అంటే ఇంతేనా? అనిపించవచ్చు ఇది చదివినవాళ్లకి. అందుకని, సువర్ణనాభుడనే కామశాస్త్ర పండితుడు చెప్పిన మరికొన్ని ఆలింగనాల్ని అదనంగా చెప్తున్నాడు-

ఎ) అబ్బాయి తన రెండు తొడలతోనూ అమ్మాయి ఒక తొడని గాని, రెండు తొడల్ని గానీ ఓపికకొద్దీ గట్టిగా బిగించి నొక్కితే దాని "ఊరూపగూహనం" అనే కౌగిలింతగా పేర్కొన్నాడు. ఉపగూహ నం అంటే స్త్రీ, పురుషులు ఒత్తిగిలి పడుకోవడం అని! ఊరు ఉపగూహనం తొడలతో ఒత్తిగిలడం అన్నమాట!

బి) నడుము లేదా బొడ్డు కంటే కింది భాగాన్ని అమ్మాయి గట్టిగా తన రెండు తొడలతో బిగించిపట్టి సంతోషాతి శయంతో విజృంభించడాన్ని "జఘనోప గూహనం" అన్నాడు.



సి) అమ్మాయి అతనివైపు తిరిగి నడుం వెనక్కి విరుచుకొంటూ తన రొమ్ముల్ని అతని గుండెలకు అదిమి గట్టిగా కౌగిలించడాన్ని "స్తనాలింగనం" అంటారు.

డి) ముఖంతో ముఖాన్ని ఆనించి, నుదురుతో నుదుర్ని, ముక్కుతో ముక్కునీ అధరాలతో అధరాల్ని, చెంపలతో చెంపను అదిమి ఉంచడాన్ని "లాలాటికం" అంటారు.

ఇ) అబ్బాయి అమ్మాయికి గాని, అమ్మాయి అబ్బాయికి గానీ పాదాలు, నడుము, భుజాలు ఇలాంటి ప్రాంతాల్ని చేతుల్తో గట్టిగా అదిమి పిసికినట్లు చెయ్యడంకూడా ఒక విధమైన కౌగిలింతే ! ఈ స్పర్శా సుఖం కూడా ఒక విధమైన ఉత్తేజాన్ని కల్గించేదే కాబట్టి ఇదికూడా కౌగిలింతల్లో ఒకరకమేనని మరికొందరు శాస్త్రవేత్తల అభిప్రాయంగా చెప్తాడు వాత్స్యాయనుడు. ఊరికే కాళ్ళు పిసకడం కూడా కౌగిలింతే..... అనడాన్ని వాత్స్యాయనుడుకూడా గట్టిగా అంగీకరించలేదు. కానీ, తనకు సుముఖంగా చేసుకోవడం కోసం, గదిలో నాలుగు గోడల మధ్య కాళ్ళు పట్టుకున్నా, ఇంకేం పట్టుకున్నా..... అన్నీ ఉత్తేజాన్ని కల్గించేందుకోసం ఉద్దేశించినవే గదా.....

ఈ ఆలింగనాలు "ఇలా ఉంటాయి" అని చెప్తుంటేనే ఇంత ఉత్తేజకరంగా వుంటాయే..... ఇంక వాటిని ఆచరించిన తర్వాత రతికార్యం కోసం ఎంతబలమైన కోరిక పుడుతుందో వేరేచెప్పాలా.....? అనడుగుతాడు వాత్స్యాయనుడు.

ఇవన్నీ ఏదో ఉదాహరణకి చెప్పిన కొన్ని అంశాలు మాత్రమే. ఇంకా అనేక రకాలుగా మనుషులు కౌగిలించుకోవచ్చు. ఎవరి సుఖం వారిది. ఎవరిష్టం వారిది. సంయోగానికి ప్రోత్సాహకరంగా వుండే సాధనాన్ని "ఆలింగనం" అంటారంతే.

ఇంకా మిగిలినవన్నీ ఇక్కడ ఎందుకు చెప్పడంలేదనే ప్రశ్నకు జవాబు చెప్తున్నాడు వాత్స్యాయనుడు : "మనిషిలో వున్న తెలియకపోవడం, అజ్ఞానం, మందమతి తనం ఇలాంటి వాటిని వదిలించి చురుకుగా తయారుచెయ్యడానికే గాని, రతి విషయంలోకి ప్రవేశించిన తర్వాత ఈ ఉపదేశాలు, ఈ శాస్త్ర విధానాలు ఏవీ అవసరంలేదు. అందుకు ఉపక్రమం పాటించవలసిన అవసరమే ఉండదు -"

## —— ముద్దులు ముందా ? కౌగిలింతలు ముందా ? ——

'రహస్య స్థావరంలోకి చేరిన తర్వాత అబ్బాయి అమ్మాయి ఒకరినొకరు కౌగిలించు కొంటారు. గిల్లుకొంటారు. కొరుక్కుంటారు. వీటిలో ఏది ముందు చెయ్యాలి.....? కామశాస్త్రంలో ఏది ముందు చెయ్యాలని చెప్పాడు.....? అని వెతకడం అవివేకులు మాత్రమే చేస్తారు. కామశాస్త్రం ఎప్పుడూ ఇలా ఫలానా పని ముందుచెయ్యి, ఇన్ని

నిమిషాల ఇన్ని సెకన్లు చెయ్యి..... ఇలాంటి చచ్చుసలహాలు చెప్పదు..... "రతి" అనేది ఒక రాగయోగం. అనురాగం మరింతగా వృద్ధి పొందడానికి ఇవన్నీ ఉపకరించే సాధనాలు. అవకాశం అందిన తర్వాత ఇందులో ఫలానాది ముందు, ఫలానాది తర్వాత అనే క్రమాన్ని పాటించగలరా ఎవరైనా.....? అని ప్రశ్నిస్తున్నాడు మహర్షి వాత్స్యాయనుడు.

## —— ఉత్తేజాన్ని ఎక్కువ సేపు కొనసాగించే ఉపాయాలు ——

చాలా మంది దంపతుల్ని మనసులో దాచుకోకుండా నిజం చెప్పమని అడిగిచూడండి..... ఏదో ఊహల్లోనో, ఆలోచనల్లోనో ఉత్తేజాన్ని తెచ్చుకొంటారు. స్త్రీలకు వంటగదిలో పనులు ముగిసి పడకగదిలోకి వచ్చే సమయం వరకూ గాని, పురుషుడు వృత్తి వ్యాపారాలు పూర్తిచేసుకొని ఇంటికి తిరిగి వచ్చేవరకూ గాని ఆ ఉత్తేజం నిలబడి వుంటే, ఆ పూట "రతి" జరుగుతుంది. లేకపోతే, చెరొకవైపూ తిరిగి పడుకొంటారు. ఒకవేళ పడకగదిలోకి చేరాక ఉత్తేజం కల్గిందే అనుకోండి..... నేరుగా రతికి తలపడడమే ధ్యేయంగా పెట్టుకొంటారు. ఈ రతి సుఖాన్ని ఇలా రెండుమూడు నిమిషాల్లో ముగించి మళ్ళీ చెరోవైపూ తిరిగి పడుకొంటారు. ఎక్కువమంది పొందుతున్న సంసార సుఖం ఇదే.

వాత్స్యాయనుడు "సంప్రయోగం" అనే అద్భుతమైన పదాన్ని ఉపయోగించాడు ఇక్కడే.

పురుషుడి లింగాన్ని స్త్రీ యోనిలో చేర్చడాన్ని సంయోగం అంటారు. ఇది రెండు నిమిషాలలోపు ముగిసే రతికార్యం. అంతే. కానీ, ఈ లైంగికోత్తేజం కనీసం రెండు



గంటలైనా నిలబెట్టుకొంటూ ఆనందిచమంటుంది శాస్త్రం. అదీ "సంప్రయోగం" అంటే! ఈ సంప్రయోగం సిద్ధించదానికి కౌగిలింతలు, ముద్దులు, గిచ్చుకోవడాలు, కొరుక్కోవడాలు, చిన్నచిన్న దెబ్బలు కొట్టుకోవడాలు ఇలాంటి ఉపాయాల్ని పాటిస్తూ ఆనందించ గలిగినంతసేపు లైంగికోత్పత్తిలో ఆనందించి, అప్పుడు, చివరిలో రతికి తలపడితే అది సంప్రయోగం అవుతుంది. ఇవేవీ లేకుండా నేరుగా రతికి తలపడితే అది వట్టి సంయోగమే అవుతుంది. గంటలకొద్దీ రతిని కొనసాగించేందుకు ఇవి ఉపాయాలన్నమాట! వీటిని ఈ దృష్టితోనే చదవండి. ఈ దృష్టితోనే ఆచరించండి.

## —— ముద్దాడే పద్ధతులు ——

1) సంయోగం జరిగిపోయిన తర్వాత ముద్దాడినా ప్రయోజనం ఏమీ ఉండదు. ఇదంతా ముందుగా జరగాలి. రతి ముగిసేవరకూ జరుగుతూనే వుండాలి.



2) ఎక్కువసేపు రతిని కొనసాగించాలనుకున్న వ్యక్తులు తప్పకుండా ముద్దులతోనే తమ కార్యాన్ని ప్రారంభిస్తారు.
3) రతిలో త్వరగా ముగిసిపోయే మందవేగులు, మధ్యమవేగులూ ఎక్కువసేపు తమ భాగస్వామికి సుఖాన్ని పంచాలని కోరుకునేట్లయితే, నేరుగా సంయోగానికి తలపడకుండా ముద్దులతో ప్రారంభించి మురిపాలన్నీ ప్రయోగిస్తారు.
4) తొందరపడకుండా, అమ్మాయి అబ్బాయికి అనుకూలురాలుగా అయిన తర్వాత, ఇది కావాలా..... అది కావాలా..... అని అడిగి ఒప్పిస్తూ ముద్దుల్ని కొనసాగిస్తారు.

5) రతి కార్యంలో మొదలు "అనురాగం" తక్కువగా ఉంటుంది. అంటే తక్కువ ఉత్తేజం వుంటుందన్నమాట. అలాంటప్పుడు ముద్దులు ఈ అనురాగాన్ని ఎక్కువ చేయడానికి బాగా ఉపయోగపడతాయి.

6) మొత్తం రతి కార్యం మధ్యదశలో స్త్రీ పురుషులు మైమరచిన దశలో మైకంగా ఉంటారు. అలాంటప్పుడు ముద్దులు, గోటిగాట్లు, పంటిగాట్లు..... ఇవన్నీ ఈ దశలో గుర్తుకురాకపోవచ్చు. అందుకని, మొదట్లోనే వీటిని ప్రయోగించడం మంచిది.

7) "సీత్కృతం" అంటే, ఉత్తేజాన్ని అణుచుకోలేక బుసకొట్టినట్లుచేసే శబ్దం (HISSING SOUND). ఈ శబ్దంచేయడం అవతలి వ్యక్తిలో కూడా ఉత్తేజాన్ని కల్గించేదిగా వుంటుంది. దీన్నే మణికూజితం అంటారు.

8) అమ్మాయికి రతి పరిజ్ఞానం, అనుభవాలు తక్కువగా వున్నప్పుడు, నమ్మించి, అనునయించి క్రమంగా ఒక్కటొక్కటే ప్రయోగించాలి గానీ, అన్నీ ఒకేసారి ప్రయోగిస్తే బెదిరిపోయే ప్రమాదం ఉంది.

9) రతికి తలపడే స్త్రీ పురుషులు తమ విధానం అవతలి వ్యక్తికి సంతోషదాయకంగా ఉందా లేదా అనే సంగతిని గమనించుకోకుండా ఏకపక్షంగా రతిని కొనసాగిస్తే అది సుఖాన్ని పొందడమే గాని, సుఖపెట్టడం అనిపించుకోదు. ఇందువలన భాగస్వామి బెదిరిపోతే ఇంక పొందే సుఖంకూడా ఏమీ ఉండదు.

## ముద్దులు ఎక్కడెక్కడ పెట్టుకోవచ్చు?

కామశాస్త్రవేత్తలు ముద్దులు పెట్టుకోదగిన చోట్లు చెప్పారు. ముద్దులు పెట్టుకొనే చోటుని బట్టి ముద్దుల్లో తేడాలు కూడా చెప్పారు.



"లలాటాలక కపోల నయన వక్షః స్తన - ఓష్ఠాంతర్ముఖేషు చుంబనమే" అని ఒక సూత్రం చెప్పాడు వాత్స్యాయనుడు. దీని అర్థం తేలికగానే తెలుస్తోంది -

1) లలాటం = నుదురు
2) అలకా = ముంగురులు
3) కపోలా = చెక్కిలి
4) నయనః = కనురెప్పలు
5) వక్షః = వక్షస్థలం
6) స్తనః = స్తనాలు
7) ఓష్ఠః = పెదాలు
8) అంతర్ముఖః = నాలుక

ఇవి ముద్దాడేందుకు ఎక్కువ మంది ఇష్టపడే చోట్లు. ఈ చోట్లలో స్త్రీని పురుషుడు ముద్దాడినా, పురుషుడ్ని స్త్రీ ముద్దాడినా ఇద్దరికి ఉత్తేజకరంగా వుంటుంది.

ఈ చోట్లలో కాకుండా, గజ్జల్లోనూ, చంకల్లోనూ, జననాంగం మీద కూడా మరికొందరు ముద్దు పెట్టుకొంటూ ఉంటారు. రాగాంధులే ఇలాంటి చోట్ల ముద్దుపెట్టుకొంటారు గానీ, సాధారణంగా ఈ మూడుచోట్ల శిష్టులైన వ్యక్తులు ముద్దాడరని, మొదట చెప్పిన ఎనిమిదిచోట్లు మాత్రమే ముద్దాడదగిన చోట్లనీ వాత్స్యాయనుడు చెప్పాడు.

## —— ముద్దు అంటే ఏమిటి ? ——

"ముద్దు" అంటే, మూతిని సంపుటీకరించి తన ఇష్టమైన ప్రదేశం మీద వుంచడం....." ఇది వాత్స్యాయనుడు చెప్పిన నిర్వచనం. ఇలా ఉంచి కొద్దిగా శబ్దంచేస్తే దాన్ని ముద్దు అంటారు అన్నాడు. అమ్మాయి సిగ్గుతో బిగుసుకు పోయినప్పుడు, ఆమెలో నమ్మకాన్ని పెంచి, అనురాగం కల్గించడంకోసం అబ్బాయి తనని ఫలానా చోట ముద్దుపెట్టుకోమని కోరతాడు. బుగ్గనో, పెదిమలనో చూపించి "ఇక్కడ" అంటాడు. అంటే, ముద్దు అనేది అవతలి వ్యక్తిలో భయాన్ని పోగొట్టి తన అనురాగాన్ని చాటేందుకు ఒక సాధనంగా ఉపయోగపడ్తోంది. రతి కార్యక్రమాల్లో చాలా సందర్భాల్లో ఇదే ముందుగా ఆచరించబడే కార్యం. ఒక విధంగా చెప్పాలంటే రతి ముచ్చట్లన్నీ ముద్దుతోనే మొదలౌతాయి !!

## —— తొలి వలపు ముద్దులు ——

ముద్దు పెట్టడానికైనా, ముద్దుపుచ్చుకోవడానికైనా పెదిమలే ముఖ్యం కదా! అందుకని పెదిమలపైన పెట్టే ముద్దుల గురించి ముందుగా చెప్తున్నాడు మహర్షి.

1) క్రింది పెదవితోనే ఎక్కువగా ముద్దివ్వడం; పుచ్చుకోవడం జరుగుతుంది. కొత్తగా పెళ్ళయి కాపురానికొచ్చిన స్త్రీతో మొదటిరాత్రి గడుపుతున్న పురుషుడు తనపైన నమ్మకాన్ని, అనురాగాన్ని కల్గించడం కోసం చేసే మొదటి ప్రయత్నం..... క్రింది పెదవిని ముద్దుపెట్టుకోవడం అంటాడు వాత్స్యాయనుడు.

   ఇది కూడా ఎలా జరుగుతుందంటే, అబ్బాయి ఆ అమ్మాయిని లాలించి తన దారికి తెచ్చుకొంటూ, తన బుగ్గచూపించి అక్కడ ముద్దుపెట్టుకోమంటాడు. ఆ అమ్మాయి సిగ్గుపడ్తుంది. ఇతను పదేపదే బ్రతిమాలుతాడు. కొంతసేపటికి ఆమె మెత్తపడ్తుంది. మెత్తపడుతుంది గాని, ఇంకా సిగ్గువదలని స్థితిలో బుగ్గకు ముఖం ఆనించి వదిలేస్తుంది. ముఖం అంటే పెదిమలే! అలా ఆనించి వదిలేస్తుంది కాబట్టి ఈ ప్రక్రియని "నిమితకం" అంటారు.

2) "అబ్బే చాల్లేదు" అంటాడు అబ్బాయి. ఇంకా గట్టిగా కావాలని మళ్ళీ బతిమాలుకొంటాడు. అప్పుడు అమ్మాయి మరింత సిగ్గుపడి, జంకుతూ, ముద్దు అంటే తన ఇష్టాన్ని ప్రకటిస్తూనే అతన్ని నిరవారిస్తూనే కాసేపు బెట్టుచేసి, ముఖాన్ని అతని బుగ్గమీద ఆనిస్తుంది. ఆనించి కింది పెదవిని మాత్రం కొద్దిగా కదిలిస్తుంది. పై పెదవిని కదిలించడానికి ఉత్సాహం చూపించదు. దీన్ని "స్ఫురితకం" అంటారు.

3) సిగ్గు పూర్తిగా వదలక పోవడం వలన చొరవచేసి నేరుగా ముద్దుపెట్టే సాహసం చెయ్యలేకపోవచ్చు. అందుకని ఇంతబెట్టు అవసరం అవుతూ వుంటుంది. ఇతను బతిమాలుతూనే వుంటాడు. ఎప్పటికో మరింత చొరవ ప్రదర్శించగలుగుతుంది. ముందు తనకళ్లు మూసుకొంటుంది. తర్వాత అతని రెండు కళ్ళు మూసేస్తుంది. అతని కింది పెదవిని తన పెదవితో తాకి, కొద్దిగా కదిలించి, నాలుకతో రాపిడిచేస్తుంది. అదీ ఘట్టితనం అనే ముద్దు.

తొలివలపు ముద్దులు ఇవి! చిరకాలం గుర్తుండిపోయే తీపిగుర్తులు.

## —— సీనియర్ ప్రేమికుల ముద్దులు ——

రతిలో అనుభవం పొందిన తర్వాత ముద్దులాటలో కూడా పరిణతి కన్పిస్తుంది. అవి తొలిముద్దుల్లాగా సాగతీత వ్యవహారంగా వుండవు. అందుకని వాటిగురించి విడిగా ఒక సూత్రంలో చెప్తున్నాడు వాత్స్యాయనుడు.

రతి అనుభవం బాగా ఉన్న అమ్మాయిలు చేసే చుంబనాలు ఇలా ఉంటాయి-



1) అబ్బాయికి ఎదురుగా కూర్చొని అతని క్రింది పెదవిని తన నోటితో గ్రహిస్తుంది అమ్మాయి. దీన్ని "దిసమ చుంబనం" అన్నాడు.

2) తన పెదాలను బాగా ముందుకుచాచి, అబ్బాయి పెదాలను చిగురంటా పూర్తిగా గ్రహించడాన్ని "తిర్యక్ చుంబనం" అని పిలిచాడు.

3) అబ్బాయి గడ్డాన్నీ, తలకాయినీ రెండు చేతుల్తోటీ గట్టిగా పట్టుకొని, తన పెదవులు కదిలిస్తూ పెట్టే గాఢమైన ముద్దుని "ఉద్భ్రాంతకం" అన్నాడు.

4) అమ్మాయి, అబ్బాయి ఒకరి పెదాలు ఒకరు పట్టుకొని నమిలేసుకొన్నట్లు ముద్దాడుకోవడం "అవపీడితకం" అనే ముద్దు. మనవాళ్ళు దీనిని ఇంగ్లీషు ముద్దు అంటూంటారు. ఇంగ్లీషు సినిమాల్లో ఇలాంటి ముద్దుని నిస్సంకోచంగా చూపిస్తూ ఉంటారు కాబట్టి అలా అంటారు. అంతేగాని, అలాంటి ముద్దులు తెలుగువాళ్ళకు తెలియవు అనిగానీ, అంత సరసం మనకు లేదని గానీ అర్థం కాదు.

ఈ అవపీడితం అనే ఇంగ్లీషు ముద్దు మూడు రకాలుగా వుంటుంది.

ఎ) పెదిమలతో మాత్రమే ముద్దుపెట్టుకోవడం. దీన్ని శుద్ధపీడితకం అన్నారు.

బి) నాలుకని ఉపయోగించి కూడా ముద్దుపెట్టుకోవడం. దీన్ని చూషణం అనీ, అధరపానం అనీ పిలుస్తారు.

సి) తన రెండు వేళ్లతో అబ్బాయి పెదిమల్ని పట్టుకొని పళ్ళుతగలకుండా పెదవులతో మాత్రమే గ్రహించి ఇచ్చే ముద్దుకూడా "అవపీడితం"లో మరో భాగంగా వాత్స్యాయనుడు పేర్కొన్నాడు.

అమ్మాయి, అబ్బాయి ఒకరి పెదవిని ఇంకొకరు గ్రహించడం కోసం ఆ ఇద్దరూ పెనగులాడారనుకోండి..... ఎంత రంజుగా ఉంటుందీ..... ఆ అనుభవం! ఎవరు పెదిమల్ని తనపెదిమలతో పట్టుకోగలుగుతారో వాళ్ళు ఆ పందెంలో గెలిచినట్లు.

మగవాడు బలంగావుంటాడు కాబట్టి, సహజంగానే ఈ పందెంలో అబ్బాయిలే గెలిచి ముందు ముద్దు పెట్టేయ గలుగుతారు. అలాకాకుండా, అమ్మాయి గెలిచిందనుకోండి..... ఏదో ట్రిక్కుచేసి గెలిచిందన్నట్టే..... అందుకని, అమ్మాయి గెలిచి ఇచ్చిన ముద్దుని "కపటం" అన్నాడు వాత్స్యాయనుడు.

ఈ పోటీని ఇలా ఎంతసేపు కొనసాగించగలిగితే ఆనందాన్ని అంతసేపు అవధులుదాటి అందుకోగలుగుతారు. ఇదీ శృంగారం అంటే ! ఉత్తేజం కలగగానే నేరుగా రతికి తలపడి రెండు నిమిషాలు కూడా సుఖాన్ని పొందని విధానాన్ని అనుసరించేవారు సెక్సును మాత్రమే అనుభవిస్తున్నారు గాని అసలైన శృంగార మాధుర్యాన్ని పొందలేకపోతున్నారంటాడు వాత్స్యాయనుడు. ఈ శృంగార చేష్టల్ని ఇలా ఆనందించ వలసిందిగా ప్రోత్సహిస్తున్నాడు.

చాలాసేపు రతిని కొనసాగించాలనే ఉత్సాహం వున్నవారు మాత్రమే ముద్దులపందెం వెయ్యగలుగుతారుగాని, మందవేగులూ, మధ్యవేగులూ ఈ పందెం వెయ్యలేరనీ, వాళ్లకంత **ఉత్సాహం వుండదనీ "చండవేగయో రేవ త్వషాం ప్రయోగః" అంటాడు వాత్స్యాయనుడు.**

## —— "ముద్దుకు క్రింది పెదవే రుచి"! ——

ముద్దాడటానికి క్రింది పెదవే అనుకూలంగా వుంటుంది. పై పెదవి ముక్కు రంధ్రాలకు దగ్గరగా వుండటం, పై దవడ దంతాలు పొడుగ్గా ఉండటం కారణంగా క్రింది పెదవి ముద్దుకు ముచ్చటగా ఉంటుందంటాడు మహర్షి.

అమ్మాయి తన క్రింది పెదవిని గ్రహించాలని ప్రయత్నిస్తున్నప్పుడు అబ్బాయి ఆమె పై పెదవిని గ్రహించడానికి ప్రయత్నించడం ముద్దుల పందెంలో మరో కోణం ! దీన్ని "ఉత్తర చుంబనం" అన్నాడు. అంటే పై పెదవితో అధరపానం చెయ్యడం అని ! కానీ, క్రింది పెదవి కున్నంత రుచి పై పెదవికి వుండదు అనేది వాత్స్యాయనులవారి అభిమతం ! మగాడి మీసాలు అడ్డొస్తూంటే, ఏ ఆడదిమాత్రం పై పెదవితో అధరపానం చెయ్యగలుగుతుందీ.....?

## —— రెండు పెదాలతో ఒకేసారి అధరపానం ——

మీసాలు తీసేసిన మగాడితో అధరపానం సులువుగా ఉంటుంది. ఇక్కడో చక్కని "ముద్దు పద్ధతి" చెప్తున్నాడు. అది, రెండు పెదవుల్ని ముడిచి ఒకరు వేరొకరి నోటిలోపలికి తన పెదాలను దూర్చి చుంబించడం - ఇలా చుంబనం చేసేప్పుడు చప్పుడుచేస్తేనే రుచిగా ఉంటుంది. ఎందుకంటే తన నోటిలోపల వున్న పెదాల్ని చప్పరించాలి కదా!

రెండు పెదవుల్ని ముడిచి ఒకేసారి చుంబిస్తారు కాబట్టి దీన్ని "సంపుటకం" అనే ముద్దుగా చెప్పాడు.

మీసాలు లేని మగాడికి సంపుటికం ముద్దు ఇవ్వగలుగుతోంది స్త్రీ. మీసాలున్నవాడు ఈ సంపుటికాన్ని ఇవ్వగలుగుతాడు గాని పొందలేడన్నమాట!

ఈ రెండు పెదిమలతో చేసే అధరపానంలో మరింత గాఢత కోసం ఇంకో ప్రక్రియని కూడా చెప్తున్నాడు. చదవండి -

"సంపుటికం ముద్దు" కోసం అమ్మాయి అబ్బాయిలలో ఎవరి పెదిమలు రెండో వాళ్ళ నోట్లో వుంటాయో వాళ్ళు తమ నాలుకతో తమ నోటిలోపలున్న పెదాల్ని తాకాలి. అదీ ఈ ముద్దుకు నిజమైన ప్రతిస్పందన. దీన్ని "అంతర్ముఖ చుంబనం" అన్నారు.

## —— నాలుకలతో "యుద్ధం - ముద్దు" ——

అమ్మాయి, అబ్బాయి తమ నాలుకల్ని పొడుగ్గా గాని, పొట్టిగా గాని చాచి రాపిడిచేయడాన్ని "జిహ్వా యుద్ధం" అని ముద్దుగా పేర్కొన్నాడు. అంటే నాలుకలతో "యుద్ధం" ముద్దుపెట్టుకోవడం అని!



యుద్ధం అంటే, ఎవరో ఒకరు గెలిచేంతవరకూ పోటీ జరగాల్సిందే కదా.....! పెదిమల్ని ముద్దుపెట్టుకోవడంతో మొదలుపెట్టి, అధరపానం దాకావచ్చి నాలుకలతో నొక్కుకుంటూ ఈ పోటీని ఎంతసేపైనా కొనసాగిస్తూ ఆనందించవచ్చు.

ఆనందించడంకోసమే గదా ఈ శాస్త్రం అంతా! ఆనందాన్ని ఎక్కువసేపు పొందడం ఎలా..... అనేది ఇక్కడ ముఖ్యవిషయం. దీనికి అంతకు మించిన ప్రయోజనం ఏమీలేదు. శృంగారానికి తలపడిన స్త్రీ పురుషులు ఈ కార్యాన్ని మూడు నిమిషాల ముచ్చటగా కాకుండా కనీసం మూడు గంటలైనా పొందగలిగితేనే ఆ సుఖానికి రమ్యత ఉంటుంది.

## —— ముద్దుల్లో ఎన్నెన్నో రకాలు ——

1) ముద్దుల్లో ఇంకా అనేక రకాలున్నాయి. స్త్రీ గాని, పురుషుడు గాని, నిద్రపోయినప్పుడు ఆ వ్యక్తిపైన తన ప్రేమకొద్దీ ముద్దు పెట్టుకోవడాన్ని రాగదీపనం అంటారు.

2) ముద్దుపెట్టుకోగానే ఆ వ్యక్తికి మెలకువ వచ్చిందనుకోండి - మెలకువరాగానే మళ్ళీ ముద్దులాట ప్రారంభిస్తే అది సాంప్రయోగికం అవుతుంది.

3) ఏదో పనివత్తిడిలో దీక్షగా మునిగి ఉన్నప్పుడు, ఆ వ్యక్తి ధ్యాసని తన వైపు మరల్చడానికి గోముగా పెట్టే ముద్దుని చలితకం అంటారు - ఇంక, అది చాలించి ఇటు రమ్మని పిలుపు ఇది !

4) అర్ధరాత్రిపూట ఎప్పుడో ఆ యిద్దరిలో ఎవరో ఒకరికి మెలుకువ వచ్చి రెండో వ్యక్తిని ఆక్రమించుకొని ముద్దులతో ముంచెత్తడాన్ని ప్రాతిబోధికం అన్నాడు. మెలకువ వచ్చేలోపే పెట్టదలచిన ముద్దులన్నీ పెట్టేయడం అన్న మాట.
5) కొంతమంది ఆడవాళ్ళు తనమీద తన భర్తకు ఎంత ప్రేమ వుందో తెలుసుకోవడం కోసం దొంగనిద్ర నటిస్తూ వుంటారు. అది గమనించి ఈ ముద్దుల వర్షాన్ని కురిపించ గలిగినవాడు భర్త అనిపించుకోగలుగుతాడు – భార్య ప్రేమను పొంది!!
6) ఇంకా గొప్పగా తన ప్రేమను ప్రకటించుకోవడానికి మరో రకం ముద్దు వుంది. అమ్మాయి కూర్చొని గాని, నిలబడి గాని ఉన్నప్పుడు గోడమీద పడ్తున్న ఆమె నీడని గానీ, అద్దంలో కనిపించే ఆమె ప్రతిబింబాన్ని గానీ ముద్దుపెట్టుకోవడం ఇంకో టెక్నిక్. దీన్ని "ఛాయా చుంబనం" అంటారు.
7) పక్కన ఉన్న ఏ చంటిపిల్లనో, పాపాయి బొమ్మనో ఎత్తుకొని ఆమె వంక చూస్తూ ముద్దుపెట్టుకోవడం..... ఈ ముద్దు నీకేననే సంకేతాన్ని ఆమెకి ఇవ్వడం..... ఇదంతా ఓ సరాదా ముద్దులాట. దీన్ని "సాంక్రాంతిక చుంబనం" అన్నాడు. మాటలు కలుపు కోవాలంటే ఇలాంటి డ్రామాలు అవసరం అవుతుంటాయి.
8) అవకాశం దొరికితే, రహస్యంగా, ఏ సినిమా హాల్లోనో, మీటింగ్ హాల్లోనో ఆమె చేతిని తీసుకొని ముద్దాడడం అంగుళీ చుంబనం. తన చేతినే ముద్దు పెట్టుకొని ఆమెకి చూపించడం కూడా ఇలాంటిదే!

## —— గిచ్చుకోవడమూ ఒక శృంగారమే ! ——

కోపం వచ్చిన వ్యక్తి గిల్లితే ఒళ్ళు మంటెత్తిపోతుంది మనకి. కాని, ఇష్టం కల్గినప్పుడు ఇష్టమైన వ్యక్తి గిల్లితే అనురాగం వరదలెత్తుతుంది. "రాగవృద్ధౌ సంఘర్షాత్మకం నఖవిలేఖనం" అన్నాడు వాత్స్యాయనుడు. అంటే, గోళ్ళను ఉపయోగించి చేసే సంఘర్షణ అనురాగవృద్ధికి ఉపయోగపడ్తుందని అర్థం. గోళ్ళ రక్కులు విడిగా వున్నప్పుడు చేస్తే మంటపుడతాయి. కాని రతిసయమంలో చేసినప్పుడు చాలా హాయిగా అన్పిస్తాయి. అందుకని ఉత్తేజాన్ని రెచ్చగొట్టడానికి "గోటి రక్కులు" బాగా ఉపయోగపడతాయి. వీటిని నఖక్షతాలంటారు. అనురాగం బాగా కల్గిన తర్వాత అంటే రతి కార్యక్రమంలో బాగా ఊపువచ్చినప్పుడు గోటిరక్కులు మంచి ఉత్తేజకరంగా ఉంటాయి. గిచ్చుకోవడమూ ఒక శృంగారమే!

ఎక్కువ సేపు రతిని కొనసాగించదలచుకున్న వారికి మాత్రమే గోటి రక్కులు ఆనందం ఇస్తాయి. "ఇంకచాల్లే....." అనిపించే మందవేగులకి వాటిలోని స్వారస్యం అర్థం కాదు. వాటిని సహించగల సహనం కావాలి స్త్రీ, పురుషులకు ముందు.

## —— ఎక్కడెక్కడ ఎలా గిచ్చుకోవాలి ? ——

గోటిరక్కుల్ని బుగ్గమీద, అధరాల మీద, కంఠానికి పక్కల్లోనూ, పొత్తికడుపు మీద, పిరుదుల మీద, తొడలమీద మాత్రమే ప్రయోగించాలి. ఎక్కడపడితే అక్కడ గిచ్చడం, అదేపనిగా గిల్లడం, అవతలి వ్యక్తికి బాధపుట్టి - ఉత్తేజం చచ్చిపోయి కళ్ళలో నీళ్లు తిరిగేలా రక్కడం దుర్మార్గం అవుతుంది. ఇలాచేసి ఆనందించే దుష్టమనస్తత్వం వున్న శాడిస్టులతో ఈ నఖక్షత శృంగారం ఇబ్బంది అవుతుంది. అంతేగానీ, చక్కని శృంగారాన్ని ఆనందించగోరే వారికి ఉత్తేజ సమయంలో గోటిరక్కులు మంచి ఊపుని కల్గిస్తాయి. ఇలా ప్రయోగిస్తే, దంపతులకు రతి సుఖం బాగా కలుగుతుందని పూర్వాచార్యులు చెప్పినట్లు వాత్స్యాయనుడు పేర్కొన్నాడు.

## —— గిల్లేవారి గోళ్ళు ఇలా ఉండాలి ——

1) ఎడమచేత్తోనే గిచ్చాలి.
2) గోళ్ళు మొనదేలి ఉండాలి. పదునుగా ఉండాలి. గుచ్చితే బాధలేకుండా హాయిగా ఉండాలంటే గోళ్ళు చక్కని మొన కలిగిఉండాలి.
3) మట్టి, మురికి లేకుండా నీటుగా ఉండాలి.
4) రంగురంగులుగా, ప్రకాశవంతంగా ఉండాలి.
5) ముళ్ళుముళ్ళుగా, రంపంపళ్ళులాగా ఉండకూడదు.
6) మెత్తగా ఉండాలి. చూడటానికి అందంగా ఉండాలి.

ఒరిస్సా, బెంగాల్ వారికన్నా దక్షిణాది స్త్రీ, పురుషులకు గోళ్ళు అందంగానూ పొట్టిగానూ, శృంగార సమయంలో గిచ్చుకోవడానికి అనుకూలంగానూ వుంటాయి..... అన్నాడు. మహారాష్ట్రుల గోళ్ళు పొడుగూ, పొట్టీ కాకుండా మధ్యరకంగా ఉంటాయన్నాడు.

## —— గిచ్చడం ఎలా ? ——

ముందే చెప్పుకున్నాం కదా..... రక్తంకారేలాగా రక్కుకుంటే, అది శృంగారం అవదని! శృంగారమయమైన గిచ్చులాట ఎలాచెయ్యాలో చెప్తున్నాడు.

1) చక్కని గుణాలతో ఉన్న అందమైన గోళ్ళున్న వ్యక్తి తన ఐదు వేళ్ళనూ ఒక గుత్తిలాగా దగ్గరగా ముడిచి బుగ్గలమీద గాని, స్తనాల మీద గాని, పెదిమలమీద గాని, తేలికగా గాటు పడకుండా నొక్కడాన్ని "ఆచ్ఛురితం" అన్నాడు. ఆ స్పర్శకే

జలదరింపు కల్గుతుంది గిచ్చేవారికి, గిచ్చించుకున్నవారికీనూ! దాంతో ఆ స్త్రీ ఉత్తేజపూరితమైన ఒక శబ్దం (సీత్కారం) చేస్తుంది. అది ఆమె పొందుతున్న ఉత్తేజ తీవ్రతకి ఒక సంకేతం!

2) కంఠానికి పక్క భాగాల్లోనూ, స్తనాలకు వెనుక భాగంలోనూ అర్ధచంద్రాకారంగా గోటితో గుచ్చితే స్త్రీకి ఉత్తేజం కలుగుతుంది.

3) చంకల్లో ఐదు వేళ్ళూ ముడిచి తేలికగా ఆన్చితే చక్కిలిగింతపుట్టి స్వాధీనమవుతుంది స్త్రీ.

4) స్తనం ముందు భాగాన, వెనక భాగాన ఒకేసారి నొక్కినట్లు గిచ్చితే దాన్ని "మండలం" అంటారు.

5) బొడ్డుదగ్గర, పిరుదులపైన, గజ్జలలోనూ ఈ మండలాన్ని ప్రయోగించినా ఆనంద దాయకంగానే ఉంటుంది స్త్రీ పురుషులిద్దరికి !

6) స్తన చూచుకం (NIPPLE) మొనమీద వంకరగా నొక్కితే దాన్ని "వ్యాఘ్రనమికం" అంటారు. పులిగోరులాగా "నొక్కు" పడ్తుంది. గిచ్చితే నొక్కుడు పడాలిగాని, చర్మం తెగి గాటు పడకూడదు. ఇది నియమం. నఖక్షతం అంటే గోటి నొక్కు మాత్రమే గాని, "గాటు" కాదు. గాయం అంతకన్నా కాదు. ఇది మరిచిపోకూడదు.

7) బొటన వ్రేలి గోటిని చనుమొనకి క్రింది భాగంలోనూ, తక్కిన నాలుగు వేళ్ళని చనుమొనకి పై భాగంలోనూ గోటినొక్కు ప్రయోగిస్తే దాన్ని మయూరపదం - నెమలి అడుగు - గోటినొక్కంటారు.

8) కేవలం చనుమొన మీద తన ఐదు వేళ్ళగోళ్ళని ఒక చోట దగ్గరగా వుండేలా ముడిచి గోళ్ళు మాత్రమే చనుమొనకు తగిలేలా నొక్కితే దాన్ని "శశప్లుతకం" అన్నాడు. స్త్రీలు ఈ విధమైన గోటినొక్కుని చాలా ఇష్టపడతారంటాడు మహర్షి.

9) స్తనాగ్రం మీద ఐదు వేళ్ళ గోళ్ళు మొనలు తాకించగానే పులకరించిపోతుంది స్త్రీ. ఇలా చేసేవాణ్ణి చక్కగా మెచ్చుకుంటారు.

10) పిరుదులమీద, తామరాకులాగా వేళ్ళని విచ్చి గోటితో నొక్కితే ఉత్పల పత్రకం అంటారు.

11) దూరప్రాంతాలకు భార్యని విడిచివెడ్తున్న మగవాడు ఆమె తొడమీద చేసిన గోటినొక్కులు ఎక్కువ కాలం ఆమెకు గుర్తుంటాయి. ఎంతకాలం తర్వాత తిరిగి వస్తాడో, అన్ని గోటినొక్కులు ప్రయోగించమంటాడు అందుకే!

12) గోటినొక్కులు ప్రయోగించడానికి నేర్పుకావాలి. అలవాటు కావాలి. తన కసికొద్దీ గిల్లి ఏడిపించడం రాక్షసం అవుతుందేగాని శృంగారం అవదు.

13) ముద్దులు, గోటి నొక్కులు, పంటినొక్కులూ ఇవన్నీ ఎప్పటికప్పుడు కొత్తకొత్తగా ఉండాలి. వైచిత్ర్యం అంటే కొత్తదనం అనురాగాన్ని పుట్టిస్తుంది. మంచి "మూడ్" తెచ్చి పెడ్తుందన్నమాట. ఒక్కోసారి రతి కార్యంలోనే వుంటారుగాని, ఏదో ఆలోచిస్తూ ఆబ్సెంట్ మైండెడ్‌గా ఉండిపోతారు కొంతమంది. అలాంటి వాళ్ళని మళ్ళీ "ఈ" దారిలోకి తేవడానికి ఈ శృంగార చేష్టలు ఉపయోగపడతాయన్నమాట! అందుకోసమే ఇవన్నీ!! మూడ్‌ని రెచ్చగొట్టడం వాటి ప్రయోజనం!!

## —— శృంగారంలో పంటినొక్కులు ——

గోటితో నొక్కడమే ఉత్తేజకరమైన కార్యం అయితే, పంటితో నొక్కడం అయితే ఇంకెంత ఉత్తేజకరంగా ఉంటుందో వూహించుకోవాల్సిందే. పంటితో నొక్కడాన్ని దంతక్షతం అంటారు. గోటినొక్కుల తర్వాత అంతకన్నా ఎక్కువగా అనురాగాన్ని వృద్ధి చేసేందుకు పంటినొక్కుల కార్యక్రమాన్ని సూచిస్తున్నాడు వాత్స్యాయన మహర్షి.

ముద్దాడేందుకు కిందిపెదవి, పంటితో నొక్కేందుకు కింది పెదవి అనుకూలంగా ఉంటాయంటాడు. నాలుక, కంటిరెప్పలు తప్ప ముఖం మీద ఎక్కడ పంటినొక్కులు ప్రయోగించినా ఉత్తేజకరంగానే ఉంటుంది. నాలుక, కంటిరెప్పలు ముద్దుపెట్టుకోవడానికి మాత్రమే ఉపయోగించే స్థలాలు.

నుదురు, అధరాలు, చెక్కిళ్ళు, కంఠానికి రెండు పక్కలూ, రొమ్ములూ పంటి నొక్కులకు అనువుగా వుండే స్థలాలు.

గజ్జలు, చంకలు, జననాంగాల మీద పంటితో కొరికే అలవాటు కొందరి కుంటుంది. ఎవరి అలవాటు వారిది. జన సామాన్యానికి సలహా ఏమంటే అక్కడ పంటినొక్కులు చెయ్యవద్దనే !

గొగ్గులు లేకుండా, తళతళలాడుతూ, నునుపుగా, సమంగా మరీపొడుగు లేకుండా, సందులు లేకుండా, మొనదేలివుండి, దానిమ్మగింజల్లా మెరుస్తూ వుండే పళ్ళతో పంటినొక్కులు ప్రయోగిస్తే ఎవరికైనా ఉత్తేజకరంగా ఉంటుంది. ముక్కపోయి, గారపట్టి, కరుకుతేలి, గొగ్గులు గొగ్గులుగా వున్న పళ్ళు ముఖ సౌందర్యాన్ని చెడగొట్టడమే కాకుండా శృంగారంలో పంటినొక్కులుక్కూడా పనికిరావు. ఇలాంటి పళ్ళున్నవారు పంటి నొక్కులు ప్రయోగించకుండా వుంటే మంచిది.

## మరింత ఉత్తేజాన్ని కల్గించే రకరకాల పంటినొక్కులు :

1) మృదువుగా, ఎక్కువ నొప్పిలేకుండా వూరికే అందమైన పంటితో స్పృశించి వదిలేయడాన్ని గూఢకం అంటారు. పెదవిపైన ఇలా పంటితో నొక్కితే బావుంటుంది.

2) ఇలాగే ఇంకొంచెం గట్టిగా నొక్కితే ఉచ్ఛూనకం అంటారు. ఇదికూడా పెదవిపైన మాత్రమే ప్రయోగించదగింది. పెదవిమీద గట్టిగా కొరికితే అక్కడ పొంగుతుంది కదా..... అందుకని "ఉచ్ఛూనకం" అన్నారు. దీన్ని పెదవులమీద బుగ్గలమీద కూడా ప్రయోగించ వచ్చు.

3) పై పళ్ళతో అవతలి వ్యక్తి కిందిపెదవిని గానీ, కింది పళ్ళతో అవతలి వ్యక్తి పై పెదవిని గానీ నొక్కడం చేస్తే దాన్ని ప్రవాళమణిసిద్ధి అంటారు.



4) పెదవులమీద అనేకసార్లు చేస్తే పంటిగాట్ల వరుస ఏర్పడుతుంది కాబట్టి దాన్ని "మణిమాల" అంటారు.

5) కంఠానికి అటువైపు గానీ, ఇటువైపు గానీ, అలాగే క్రింది పెదవి మీదగానీ నువ్వుగింజంత పంటి నొక్కు పెడితే దాన్ని బిందుసిద్ధి అంటారు.

6) ఈ బిందువులు వరుసగా నాలుగు పళ్ళతోనూ చేస్తే నాలుగు నొక్కులు పడతాయికదా - దాన్ని బిందుమాల అంటారు. ఈ బిందుమాలాన్ని కంఠానికి పక్కల్లోనూ, చంకలకు కింది భాగంలోనూ, నుదురుమీద, తొడల మీద కూడా ప్రయోగించవచ్చు.

7) స్తనాలమీద గుండ్రంగా ఏర్పరచిన దంతపునొక్కుల్ని ఖండాభ్రకం అంటారు. రొమ్ములు పంటినొక్కులకు అనువుగా వుంటాయి కాబట్టి కొన్ని పళ్ళు బాగా నొక్కుకునేలాగా, కొన్ని పళ్ళు తేలికగా నొక్కుకునేలాగా కొరకడంలో ఒకరకమైన మాధుర్యం వుంది. అది ఆ స్త్రీకి ఆనందాన్ని కల్గించేదిగా వుంటుంది. అలా వున్నప్పుడే పంటినొక్కులు గోటినొక్కులు శాస్త్రోక్తంగా నెరవేర్చినట్లు. అవి అవతలి వ్యక్తిని బాధించినప్పుడు పైశాచిక ఆనందాన్ని పొందినట్టే!!

8) స్తనం గుండ్రంగా, విస్తారంగా, పెద్దదిగా వున్నదైతే, దాని వెనక భాగంలో అంటే చెస్ట్‌నుంచి రొమ్ము మొదలయ్యే భాగంలో ఈ మూలనుంచి ఆ మూలదాకా పళ్ళతో నొక్కడాన్ని వరాహచర్వితం అంటారు. చాలాసేపు శృంగారాన్ని నెరవేర్చే సందర్భంలో దీన్ని ప్రయోగిస్తారు.

9) స్తనాలమీదచేసే పంటినొక్కులు కేవలం స్త్రీలపైన మాత్రమే ప్రయోగించేవి కావాలని లేదు. ఇదే ప్రయోగాన్ని స్త్రీలు పురుషుడి వక్షస్థలం (చెస్ట్) మీదకూడా ప్రయోగించవచ్చు. స్త్రీలు మగవాడి రొమ్ముల్ని కొరకడానికి జంకవలసిన అవసరంలేదు. శాస్త్రోక్తంగా కొరికితే ఎక్కువసేపు రతిని కొనసాగించగోరే పురుషుడు తప్పకుండా ఆనందిస్తాడు.

శాస్త్రంలో చెప్పిన పద్ధతుల్ని పాటించడాన్ని శాస్త్రాచారం అంటారు. కొన్నికొన్ని ప్రాంతాల్లో కొన్నికొన్ని ప్రత్యేకమైన అలవాట్లుంటాయి. ఉదాహరణకు పంజాబ్ ప్రాంతీయులు జననాంగాల్ని ముద్దాడే అలవాటు కలిగివుంటారు. ఇవి దేశాచారాలు. ఇవికాక ఎవరికివాళ్ళు, వాళ్ళ స్వంత వూహనిబట్టి, ఇష్టాన్ని బట్టి అవలంభించే విధానాలుంటాయి. అవి ఇష్టాచారాలు. ఈ ఆచారాలన్నీ స్త్రీ పురుషులు ఒకరినొకరు తృప్తిపరచడానికి ఉద్దేశించినవి! శృంగారంలో తృప్తి పరచడమే మొదటి లక్షణం. తృప్తిపొందడం దానికదే కలుగుతుంది!

## —— ఏది ఎక్కువ స్పర్శా సుఖాన్ని కల్గిస్తుంది ? ——

1) స్త్రీ పురుషులు ఒకరినొకరు తాకగానే స్పందన కలిగి బరువుగా ఊపిరి పీల్చుకోవడంవలన ఏర్పడే శబ్దాన్ని సీత్కృతం అంటారు (HISSING SOUND). స్పర్శాసుఖ అనుభవానికి, ఇది సాక్ష్యం. ఒకరి సీత్కృతం రెండో వారికి ఉత్తేజ కారకంగా వుంటుంది.

2) ఇంతకన్నా సుఖంగా వుండేది బుగ్గలు, స్తనాలు, ఇలాంటి చోట చిన్నచిటికె వెయ్యడం, చిన్న దెబ్బ వెయ్యడం లాంటి ప్రహణణం. ఇది రెండోస్థాయి.

3) దీనికన్నా ఉత్తేజకరంగా వుండేవి పంటినొక్కులు. అవి ఎక్కడెక్కడ ఎలాంటి ఉత్తేజాన్ని ఇస్తాయో మనం చర్చించుకున్నాం.

4) పంటినొక్కులకన్నా గోటినొక్కులు ఎక్కువ ఉత్తేజకరంగా వుంటాయి.

5) వీటన్నింటికన్నా "ముద్దు" ఎక్కువ "రంజు"గా వుంటుంది.

6) ముద్దుకన్నా, కౌగిలింతలో మురిపెం ఇంకా ఎక్కువగా వుంటుందనేది అనుభవంలోని విషయమే.

ఈ ఆరూ ఒకదానికి మించి మరొకటి ఉత్తేజదాయకంగా వుంటాయని వాత్సాయన మహర్షి పేర్కొన్నాడు. స్వర్గసుఖంలో దివ్యానుభవం కల్గించేది కేవలం ఆలింగనం మాత్రమేనన్నమాట!

## —— సుఖానుభవం కోసం భార్యా భర్తా పోటీపడాలి!! ——

స్త్రీ పురుషులు రతి కార్యాన్ని ప్రారంభించిన తర్వాత సుఖాన్ని అందివ్వడంలో పోటీపడాలి. అలా అందివ్వడం ద్వారానే తానూ సుఖాన్ని పొందగల్గుతారు. కాబట్టి రతిలో "సుఖపెట్టడం" అనేది ప్రధానం కాదు. సుఖాన్ని ఇవ్వడమే ముఖ్యం. దాన్నిఇవ్వడంలో పోటీపడటం ఎలాగో చెప్తున్నాడు వాత్స్యాయనుడు.

ఇప్పుడొద్దు అని వారిస్తున్నా ఆగకుండా పురుషుడు పంటినొక్కుని గాని, గోటి నొక్కుని గానీ ప్రయోగించాడనుకోండి..... దాన్ని సహించలేని స్త్రీ అంతే స్థాయిలోనో, అంతకన్నా ఎక్కువ స్థాయిలోనో అదే ప్రయోగాన్ని అతనిమీద చెయ్యడం - పోటీ పడడం అంటే!

అతను బిందువు (ఒక పంటినొక్కు) ప్రయోగిస్తే ఆమె బిందువులు (అనేక పంటినొక్కులు) ప్రయోగించి జవాబివ్వాలి. అతను బిందుమాలని ఒకచోట ప్రయోగిస్తే ఆమె వరాహచర్వితం చెయ్యాలి! తన నోటికందిన వస్తువుని పళ్ళతో నొక్కిపట్టి పంది ఎలా చప్పరిస్తుందో అలా చప్పరించడం వరాహచర్వితం అంటే!

ఇలా నాయికా నాయకులు ప్రణయకలహాలు ప్రారంభిస్తారు. అందువలన "రతికలహాలు" తీపిగుర్తులుగా మిగిలిపోతాయి ఆ యిద్దరి మధ్యా!

## —— అధర పానం..... ఇలా.....! ——

ముందుగా ఆమె ఒక చేత్తో అతని తలని, రెండవచేత్తో గడ్డాన్నీ పట్టి పైకెత్తి అప్పుడు అమృత రసోపమానమైన అధరసుధారసాన్ని అతనికి అందించాలి. అతని నోటికి తన క్రిందిపెదవిని అందించి, అతనుపానం చేస్తుండగా ఆమె అతన్ని బాగా



కౌగిలించి అతనిలో ఐక్యం అయిపోవాలి. ఇదంతా జరుగుతున్నప్పుడే గోటినొక్కులు, తాడనాలు, సీత్కారాలు..... జరుపుతూ మరింత రెచ్చగొట్టే పనిచెయ్యాలి. ఇలా ఇద్దరూ ఒకరినొకరు రెచ్చగొట్టుకోగలిగితేనే వారి "రతి" లో పసందు వుంటుంది. అతను అధరపానం చేస్తుండగా ఆమె అతని కంఠానికి రెండు వైపులా గోటినొక్కులు ప్రయోగించినప్పుడు అతను చలించిపోతాడు. నిలువెల్లా పులకించి పోతాడు. ఇలా చెయ్యడం శాస్త్రం.

ఆ మర్నాడు ఎవ్వరూ చూడకుండా అతను - చూడూ ఎంత గాటుపడిందో అని గోటినొక్కును చూపిస్తాడు. "నువ్వు చేసిందానికి ఆమాత్రం శాస్తి జరగాల్సిందేలే....." అన్నట్లుగా ఆమె ఒకచూపు విసుర్తుంది. అందులోనూ ఎంతో పసందు వుంటుంది.

ఆమె విసిరిన చూపును తీసుకొని అతను కూడా ఓ "హుళక్కి ముద్దు"ని మూతిని ముద్దుపెట్టినట్లు ముడిచి విసురుతాడు. నువ్వు ఇంతలా గిచ్చినా నాకు సంతోషంగానే వున్నదనడం ఈ "హుళక్కి ముద్దు"లో పరమార్థం!

## —— సంభోగానికి అర్హత ఎప్పుడొస్తుంది.....? ——

ఇప్పటిదాకా చర్చించుకున్న ఆరు రకాల స్పర్శాసుఖాల్ని ఎక్కువసేపు అనుభవించి, బాగా ఆనందించి, మంచి ఉత్తేజాన్ని పొందిన స్థితిలో వున్న స్త్రీ పురుషులకి మాత్రమే సంభోగానికి అర్హత వస్తుంది. అదీ "రాగకాలం" అంటే! బాగావృద్ధి పొందిన ఉత్తేజం ఏర్పడిన కాలాన్ని "రాగకాలం" అంటారు.

బాగా వృద్ధిపొందిన ఉత్తేజస్థితి The Culminating Point in Sexual Inter-course-culmination of emotional excitement - దీన్ని (ORGASM) అంటారు ఆధునిక మానసిక శాస్త్ర పరిభాషలో!

ఈ స్థితి ఏర్పడిన తర్వాత సంభోగానికి సిద్ధపడతారు. దీన్ని "సంవేశనం" అనే స్థితిగా వాత్స్యాయనుడు పేర్కొన్నాడు. వైద్య పరిభాషలో "ట్యూమ్ సెన్స్" అంటారు. స్త్రీ జననాంగంలోకి పురుష జననాంగం ప్రవేశింపచేసిన స్థితి ఈ "సంవేశ్యం" అంటే!

## —— సంభోగం ఇలా! ——

సంయోగ సమయంలో స్త్రీ, పురుషులు పడుకోవలసిన విధానాన్ని చెబుతున్నాడు వాత్స్యాయన మహర్షి!

1) ఎవరికి ఏ విధమైన భంగిమ (posture) అనుకూలంగా వుంటుందో ఆ భంగిమలో శయనించడం సరయిన విధానం.



2) పురుషావయవం పొడవు, లావు ఎక్కువగా వున్న మగవాడితో, తన జననాంగం చిన్నదిగా వున్న స్త్రీ రతికి తలపడుతున్నప్పుడు, బాధకలగకుండా వుండాలంటే రెండుకాళ్లను పొట్ట మీదకు లాక్కుని వెడల్పుగా విస్తరిస్తే ఆమె జననాంగం బాగా విచ్చుకొని అంగ ప్రవేశం సుఖంగా జరుగుతుంది.

అంగప్రవేశం జరగడానికి "కష్టం" గా వున్నప్పుడు బాధగా వుండటమే కాకుండా, పురుషావయవాన్ని లోనికి చొప్పించడానికి ప్రయత్నించడంలోనే ఆ పురుషుడు స్ఖలనం అయిపోయి రతిని విరమించవలసి రావచ్చు. అందుకని, పురుషావయవం ఫ్రీగా లోనికి ప్రవేశించేలాగా తొడలను చాచడం అవసరం. ఆ తర్వాత కాళ్ళను జాపినా రతి సుఖంగానే సాగుతుంది.

3) తన అవయవ పరిమాణంకన్నా పురుషుడి అవయవ పరిమాణం చిన్నదిగా వున్నప్పుడు ఆ స్త్రీ తనతొడలను కలిపివుంచి "భగం" ముడుచుకు వుండేట్లుగా చేస్తూనే పడుకోవాలి. లేకపోతే వదులుగా వున్న యోనిలో "రతి" సుఖంగా వుండదు.

4) **"న్యాయో యత్రయోగ స్తుత్సమప్పష్టం"** అన్నాడు. నాయికానాయకుల భగలింగాలు సరిసమానంగా సరిపడితే అది "న్యాయం"గా వుంటుంది కదా! దాన్ని సమరతం అంటారు. ఈ రెండు అవయవాలూ సరిసమానంగా లేనప్పుడు శయనించే విధానాన్ని తదనుగుణంగా మార్చుకొని అనుకూలత సాధించుకోవాలి.

5) ఇదంతా స్త్రీలు చేయవలసిన విధానం. తనకన్నా పెద్దదిగా పురుషావయవం ఉన్నప్పుడు తొడలు వెడల్పుచేయాలి. చిన్నదిగా వున్నప్పుడు కలిపి నొక్కివుంచి రతిచెయ్యాలి. సరిసమానంగా వున్నప్పుడు సరిసమానంగా వుంచి పడుకొని రతిలో పాల్గొనాలి.

6) "తత్ర జఘనేన నాయకం ప్రతి గృహ్ణీయాత్" అంటే, నడుము, కాళ్ళు, తొడలు వీటిని తగిన పొజిషన్‌లో అమర్చడం ద్వారా పురుషుడి జననాంగాన్ని స్వేచ్ఛగా తన మదనమందిరంలోకి గ్రహించడం ఆడవారు నేర్చుకోవలసిన విద్య..... అంటాడు వాత్స్యాయనుడు.

7) నాయిక, సంయోగ సమయంలో పక్కమీద వెల్లకిలా పడుకుని నడుమును మాత్రమే పైకెత్తుతూ "రతి అనుకూలత"ని కల్గిస్తే దాన్ని ఉత్ఫుల్లకం" అంటారు.

   అది రతి సమయంలో సహజంగా ఆవేశపూరితమైన స్థితిలో సంభవించేదే అయినా, "భగం" బాగా విస్తరించడం కోసం తోడ్పడుతుంది.

   అలా నడుమును పైకెత్తడానికి తగిన శక్తిలేని సుకుమార స్త్రీలు నడుము కింద మెత్తటి పల్చని దిండుని పెట్టుకోవచ్చు. ఏమైనా దానికదేగా (Spontanious) నడుమును పైకెత్తి రతిని పొందగలిగితేనే సుఖప్రాప్తి కల్గుతుంది.

8) తన భగాన్ని విస్తారంగా తెరిచిన తర్వాత పురుషావయవాన్ని తన చేతితో తీసుకొని, ఆ స్త్రీ తనే స్వయంగా భగమార్గంలోకి ప్రవేశపెట్టుకోవాలి.

   ఇలా చేసినందువలన ప్రయోజనం ఏమంటే, యోనిద్వారం లోపలికి అవయవాన్ని ప్రవేశపెట్టడానికి ప్రయాసపడడంలోనే మగవాడి "రతికార్యం"



ముగిసిపోకుండా తేలికగా లింగప్రవేశం జరుగుతుంది. ఇది తేలికగా జరగనప్పుడు ఆ పూట ఫెయిలైనట్లేనని భావించుకొంటారు ఆ ఇద్దరూ.

ముఖ్యంగా మొదటిసారి రతికి తలపడే స్త్రీ పురుషులు యుక్తియుక్తంగా ఈ విధంగా పొజిషన్లను అప్పటికప్పుడు మార్చుకోగలగాలి.

పురుషుడు ఆమె స్తనాలను మర్దిస్తూ వుండగా, ఆమె ఆవేశంగా పురుషావయవాన్ని తన లోపలికి ప్రవేశపెట్టుకొంటూ, తన కాళ్ళను ఆ పురుషుడి నడుము మీదకు వేసి నొక్కుకొంటూ వుంటుంది. ఇలా నాయిక, నడుమును పైకెత్తి బాగా విస్తృతంచేసి ఉంచుతుంది. కాబట్టి ఈ భంగిమని ఉత్ఫుల్లకం అన్నారు.

9) పురుషావయవం భగప్రవేశం చేశాక అది సుఖంగా లోపలికి చొచ్చుకు వెళ్ళేందుకు అతడుగాని, ఆమెగాని నడుమును బాగా కదిలించి ఎదురు నొక్కడాన్ని, అవపాటిక అంటారు. అలా గట్టిగా అదమడం వలన స్త్రీ యోని ద్రవించడం ప్రారంభిస్తుంది. ద్రవీభూతమైన అంటే తడితడిగా వున్న యోనిలో "రతి సుఖం" వుంటుంది. తడిలేనప్పుడు పురుషావయవానికి బాధకలుగుతుంది. ఆ స్త్రీకి కూడా రతి కష్టంగానే అన్పిస్తుంది.

రతి సమయంలో జననాంగంలో నొప్పి, బాధ కలగడాన్ని "డిస్పెరూనియా" (Dispareunia) అంటారు.

10) స్త్రీ, తన పాదాలను పూర్తిగా పైకి చాచిపెట్టి, లేదా వెనక్కి విరిచి తన జననాంగం బాగా విచ్చుకునేలా ఎత్తి వుంచితే దాన్ని "విజృంభితకం" అంటారు. లావైన, పొడవైన జననాంగాన్ని ఈ విధంగా వుంచితే అది తేలికగా లోనికి ప్రవేశిస్తుంది.



11) మోకాళ్ళు దగ్గరకు ముడిచి, పిక్కల్ని తొడల దాకా తెచ్చి రెండు పక్కలకూ వెడల్పుగా విస్తరించడాన్ని ఇంద్రాణి బంధం అంటారు. ఈ బంధంలో పురుషుడు ఆ స్త్రీ మోకాళ్ళని తన చంకలతో బంధించి తన బరువుని ఆమె మోకాళ్ళ మీద వేసి రతిని చేస్తాడు. ఈ బంధాన్ని దేవేంద్రుడి భార్య శచీదేవి కనిపెట్టిందని, ఆమెపేరుతో ఇంద్రాణి బంధం అన్నారు. ఇది బాగా సీనియర్లయిన స్త్రీ పురుషులు మాత్రమే చెయ్యగలిగిన రతివిధానం.

ఈ 'బంధం' వేసి రతి చేసే వ్యక్తికి పొట్టలేకుండా ఉండాలి. నడుము నొప్పులు లేకుండా వుండాలి. శరీరాన్ని ఎంతకావాలంటే అంత ఎటుకావాలంటే అటు తిప్పగలిగిన వారు తేలికగా ఆచరించగల్గిన విధానం.

12) స్త్రీ పురుషులిద్దరూ తమకాళ్ళని బారుగా చాచిపెట్టి వుంచి రతికి ఉపక్రమిస్తే ఆ విధానాన్ని సంపుటక బంధం అంటారు. ఇది మామూలుగా ఎక్కువమంది చేసే విధానమే!

ఎ) ఇలా కాళ్ళు బారజాపుకొని పడుకొని, పక్కకు ఒత్తిగిలి రతిని ప్రారంభిస్తే దాన్ని పార్శ్వ సంపుటకం అంటారు.

బి) పొట్ట క్రింద స్త్రీ, పైన పురుషుడు పడుకుని రతిచేస్తే దాన్ని ఉత్తాన సంపుటం అంటారు.

పురుషుడు పైన పడుకున్నా లేదా పురుషుడిపైనే స్త్రీ పడుకున్నా రెండూ ఉత్తానసంపుట విధానంలో జరిపిన రతి కృత్యాలే అవుతాయి.

పక్కకు తిరిగి పడుకుని రతిని చేసేటప్పుడు పురుషుడు తన నడుము భాగంలో దిండు పెట్టుకుని పక్కకు తిరిగితే ఆ స్త్రీ పురుషుల అవయవాలు మెరకపల్లాలుగా వున్నప్పుడు రతిమధ్యలో భగలింగాలు విడిపోకుండా వుంటాయి.

స్త్రీ ఎడమచేతి మీదకు తిరిగిపడుకుంటే సులువుగా వుంటుంది.

స్త్రీ పురుషులిద్దరికి పొట్టతక్కువగా వుండి సన్నగా నాజూకుగా వున్నవారికే ఈ భంగిమ సుఖంగా వుంటుంది.

పక్కకు తిరిగి పడుకున్నప్పుడు పురుషుడు తన ఎడమ చేతిని పైకి వుండేలాగా పడుకుంటే, ఆచేత్తో భగాన్ని తాకడం, స్తన మర్దన చేయడానికి వీలుగా వుంటుంది.

కుడిచేత్తో భగాన్ని తాకినందువలన ఒక ఇబ్బంది వుంది. భోజనం తర్వాత వెంటనే రతికి తలపడ్తుంటారు సాధారణంగా భార్యా భర్తలు. అన్నంతినే చెయ్యిని ఎంత బాగా కడుక్కున్నా కూడా ఆ వేలు కంటికి తగిలితే మంట పుడ్తుంది కదా..... అంతే సున్నితమైన యోనికి కుడి చెయ్యితగిలినప్పుడు కూడా ఇలానే మంటపుట్టే అవకాశం వుంది. అందుకని ఎడమచేతిని ఉపయోగించమన్నాడు.

## —— రతిలో ఆంధ్రా టెక్నిక్ ——

రతి సమయంలో స్త్రీ పురుషులిద్దరూ మంచం కదిలిపోయే కిర్రుకిర్రుమనే శబ్దంచేస్తూ కదలాల్సిన అవసరంలేదు. అలా కదలకుండా రతిని చేసే ఒక విధానాన్ని ఆంధ్రా స్త్రీలు అభ్యసించారని వాత్స్యాయనుడు చెప్పాడు.

ఆంధ్రా స్త్రీలు ఎప్పుడూ ఏదో ఒక కొత్త విధానాన్ని అనుసరించడానికి ఇష్టపడతారట. దాన్ని ప్రాక్టీస్‌చేసి విజయం సాధిస్తారట. అడుగున స్త్రీ, పైన పురుషుడు పడుకుని రతిని జరుపుతున్నా ఆ స్త్రీ పురుషులిద్దరూ కదలకుండా ఉంటారు. స్త్రీ తన భగంతో పురుషావయవాన్ని గట్టిగా నొక్కిపట్టి స్పందనల్ని కల్గిస్తుంది. స్త్రీ యోని మాత్రమే స్పందించడం వలన పురుషావయవం గట్టి రాపిడిని పొంది, పురుషుడు ఊపునివ్వడం ద్వారా ఇచ్చే సంతృప్తికన్నా ఎక్కువ సంతృప్తిని ఆ స్త్రీ పొందుతుంది, అంతే సంతృప్తిని అతనికిస్తుంది. ఈ విధానంలో మరొక అదనపు ప్రయోజనం ఏమంటే, రతిలో పురుషుడు ఎక్కువసేపు నిలిచివుండేందుకు అవకాశం కల్గుతుంది. పురుషావయవాన్ని వెనకా ముందులకు కదిలించడంవల్లనే, త్వరగా వీర్యస్ఖలనం జరిగే అవకాశం వుంది. పురుషావయవాన్ని కదల్చకుండా వైబ్రేషన్ పొందడం వలన ఎక్కువసేపు రతిలో నిలిచి వుంటాడు పురుషుడు. అంతే సుఖాన్ని పొందుతాడు కూడా !

## —— క్లిష్టతరమైన కొన్ని రతి బంధాలు ——

1) స్త్రీ వెల్లకిలా పడుకుని తన రెండు తొడల్ని పైకి చాపినప్పుడు పురుషుడు ఆమె తొడల్ని కావులించుకొని పడుకుని రతిచేయడం ఒక భంగిమ. దాన్ని భుగ్నకం అంటారు.
2) ఆమె తొడలను కావులించుకున్నప్పుడు, ఆమె మోకాళ్ళు అతని భుజాలమీదకు వేసి వుంచిన బంధాన్ని జృంభతకం అంటారు.
3) ఆమె వెల్లకిలా పడుకొని వుండి, అతని వక్షస్థలం మీద ఆమె పాదాలని వుంచినప్పుడు ఆ పాదాలమీద తన బరువును వేసి, చేతులతో ఆమె మెడని కౌగిలించుకొని జరిపే రతిని "ఉత్పిడితకం" అంటారు.



4) ఆమె ఒక పాదాన్ని అతని వక్షస్థలంమీద వుంచి, రెండో పాదాన్ని బారుగా జాపి వుంచితే "అర్ధ పీడితకం" అంటారు. ఇందులో ఆమె కుడి పాదాన్ని అతని వక్షస్థలం ఎడమవైపున, ఎడమ పాదం అయితే కుడివైపునా వుంచిచేసే రతి భంగిమని ఒక అర్ధ పీడితకం అని అంటారు.

5) ఒక పాదాన్ని అతని భుజాల మీద వుంచి, అంగప్రవేశం తర్వాత ఆ పాదాన్ని మళ్ళీ బారుగా జాపితే అది "వేణుదారితకం" అంటాడు.

6) భుజాల మీద కాకుండా, స్త్రీ తన ఒక పాదాన్ని పురుషుడి తలదాకా తీసుకొచ్చి వుంచి, రెండో పాదాన్ని చాచిన బంధాన్ని శూలాచితకం అంటారు. ఇలా చెయ్యాలంటే, ఆ స్త్రీకి చాలా ప్రాక్టీస్ కావాలి. కానీ, చెయ్యగలిగే వారుంటారు. అప్పుడు ఆమె యోని బాగా విప్పారుతుంది. అందుకు తగ్గట్టుగా పురుషుడుకూడా వ్యవహరించగలిగితేనే ఆమె సంతృప్తి చెందుతుంది.

7) పాదాలను బాగా దగ్గరకు తీసుకొని, పొట్టమీదకు ముడుచుకొని పడుకుంటే, ఆమె పాదాలు అతని బొడ్డు దగ్గరకు వస్తాయి. ఆమె పాదాలమీద అతని బరువునుంచి రమించడాన్ని "కార్కాటికం" అంటాడు.

8) తనపైన పరుండి రతికి తలపడ్తున్న పురుషుడి నడుంమీదకు రెండుకాళ్ళనూ అటూఇటూ వేసి గట్టిగా అదిమిపట్టి నొక్కడాన్ని పీడితకం అంటారు.

9) వెల్లకిలా పడుకున్న నాయిక తన ఎడమపాదాన్ని అతని కుడిగజ్జకూ, కుడిపాదాన్ని ఎడమ గజ్జకూ ఆన్చిఉంచితే, అతను ఆమె పాదాల్ని తన గజ్జలతో అణిచిఉంచి రతిని చెయ్యడం ఓ అద్భుతమైన బంధనం. దీన్ని పద్మాసన బంధనం అంటారు.

10) "భగప్రవేశం" జరిగిన తర్వాత పురుషుడు, భగంలోంచి తన అవయవం బైటకు రాకుండా అదిమిపట్టి వుంచి, తన నడుముకు పైభాగాన్ని వెనక్కి తిప్పి, వీపు భాగంతో ఆమె రొమ్ముల్ని అదుముతుంటే, ఆమె అతన్ని కౌగిలించుకుంటూ వుండగా అతను రతిని కొనసాగించే బంధనం మరీ అద్భుతమైంది. ఇది చెయ్యగలగాలంటే ఆ పురుషుడికి చాలా ప్రాక్టీస్ కావాలి. అతని పురుషావయవం పెద్దదిగా వుండాలి. అతని నడుము సన్నగా వుండాలి. పొట్టలేనివాడై వుండాలి. దీన్ని పరావృత్తకం అంటారు.

11) నాయికను తనమీదకు లాక్కుని, తాను కిందవుండి ఆమె భగంలోకి అవయవాన్ని చొప్పించిన తర్వాత, ఇదే విధంగా ఆమె నడుము నుంచి పై భాగాన్ని వెనక్కి తిప్పి, భగాలింగాలు విడిపోకుండా రతిని కొనసాగిస్తూనే ఆమె రొమ్ముల్ని మర్దిస్తూ కౌగిలించు కోవడం కూడా ఒక అద్భుత బంధనమే. దీన్ని కూడా పరావృత్తకం అనే అంటారు.

## —— చిత్ర రతి ——

హాయిగా సుఖంగా మెత్తగా వున్న పట్టెమంచం, చక్కని ఏసీ గది, ఏకాంత వాతావరణం అన్ని అమరిన చోట ఇప్పటి దాకా చెప్పుకున్న రతి విధానాలన్నీ అనుభవించగలిగి వుంటాయి. కానీ, ఇవేవీ అమరనప్పుడు, ఎక్కడో దొరికిన కొద్దిపాటి ఏకాంతంలో ఆకాస్త పనీ ముగించి వేయాలనుకునే వాళ్ళకోసం కొన్ని రతి బంధనాలు చెప్పారు. వీటిని చిత్రరతులు అంటారు. వీటిని నేలమీద పడుకునో, కూర్చునో, నిల్చునో చేస్తుంటారు. 'కక్కుర్తి' అంటామే... అలాంటిది ఇది ! అయినా సుఖప్రాప్తి కావాలి కదా... అందుకే ఈ ఉపాయాలు.

1) పడకలూ లేవు పడకగదులూ లేవు. అలాంటిచోట నాయికా, నాయకులు ఒకరికొకరు కౌగిలించుకొని గాని, గోడనో, స్తంభాన్నో, చెట్టునో ఆనుకొని గాని రతి కార్యం పూర్తి చేయడాన్ని స్థితరతం అంటారు.

2) గోడని గానీ, స్తంభాన్ని గానీ నాయకుడు ఆనుకొని వుంటే అతని కంఠానికి ఆమె తన చేతులు పెనవేసి, అతని కౌగిట్లో ఆమె ఇమిడిపోయి, తన తొడలతో అతని నడుమును చుట్టుకుని మాటిమాటికీ తన చేతుల్తో అతన్ని గట్టిగా అదుముతూ తన నడుమును ప్రేరేపిస్తూ వుండగా ఆతను భగప్రవేశం చేయించి అలానే నిలబడి రతిని చేయడాన్ని **అవలంబితకం** అనే "చిత్రరతి"గా చెప్పారు.

3) ఆవు నేలమీద పడుకొన్నట్లు మోచేతుల మీదా, మోకాళ్ళమీదా ఆమె పడుకుని నడుముని పైకిలేపి వుంచుతుంది. అందువలన ఆవు పృష్ఠభాగం విచ్చుకుని వెనక్కి కన్పించినట్లు ఆమె జననాంగం విచ్చుకుంటుంది. అతను ఆంబోతులాగా ఆమె వీపుమీద తన వక్షస్థలాన్ని ఆనించి రతిని చేసినప్పుడు ఆ బంధనాన్ని "ధేనుకం" అంటారు. మనుషులు పశువుల్ని అనుకరించి చేసే రతి ఇది. మేడమీద పిట్టగోడ చాటున కాసేపు ఏకాంతస్థలం దొరికినప్పుడు ఇలాంటి బంధనాలు ఉపయోగపడతాయి. వెల్లకిలా పడుకున్న సమయంలో ఆ పురుషుడు స్త్రీ మీద ప్రయోగించే ముద్దూ ముచ్చట్లన్నీ ఈ బంధనంలో ఆమె వీపుమీద ప్రయోగించవలసివుంటుంది.

"ఆవు" ఆంబోతుల్లాగానే, కుక్కలు, గాడిదలు, గుర్రాలు, పిల్లులు, ఏనుగులు, పందులు ఇలాంటి వాటి రతి విధానాల్ని కూడా అనుకరిస్తూ స్త్రీ పురుషులు సుఖించవచ్చు.



4) ఒకేసారి ఇద్దరు ఆడవాళ్ళని రమించవలసిన స్థితిలో చిక్కుకున్నప్పుడు ఆ మగవాడి అవస్థ వర్ణానాతీతమే! ఒకామెని భగలింగ సంయోగంద్వారా రతిని చేస్తూ తృప్తి పరుస్తూనే, రెండో ఆమెని స్తన మర్దనలు, ముద్దులాటలతో రంజింపచేయాలి. సహ "సంఘాటకం" అంటారు దీన్ని.

5) అనేకమంది ఆడవాళ్ళ మధ్యన ఒక్క స్త్రీని రమించడాన్ని "గౌయూధికం" అంటారు. ఆవులమందమీద పడినా, ఆంబోతు ఒక ఆవుమీదకే ఎక్కి రమిస్తుంది. ఎంత ఆంబోతయినా అన్నింటినీ ఒక్కసారే రమించలేదు కదా..... ఇలా చాలామంది స్త్రీల సమూహంలో ఒక నాయికని రమిం చడాన్ని "గౌయూధికం" అంటారు.

నీళ్ళలో జలకాలాడ్తున్న ఆడవాళ్ళ మధ్య దూరి, అందరితోనూ సరసాలాడుతూ ఒక్క ఆడదాన్ని అక్కడికక్కడే ఆ నీటిలోనే రమించడాన్ని "వారిక్రీడితకం" అంటారు. ఇవన్నీ ఆనాటి ఫ్యూడల్ యుగంలో, రాజాంతఃపురాల్లో అతి మామూలు విషయాలు!! మగ ఏనుగు కూడా ఇదే పనిచేస్తుంది. ఆడ ఏనుగులన్నీ నీళ్ళలోకి దిగుతాయి. వాటిలో ఒకదాన్ని మగ ఏనుగు ఆ నీటిలోనే అనుభవిస్తుంది.

6) మేకపోతు మేకలమీద పడి అందిన ప్రతిదాన్ని అనుభవిస్తూ పోతుంది. ఆడలేడి గుంపుమీద పడి మగలేడి కూడా ఇలానే రమిస్తుంది. ఒకేసారి ఇద్దరు, ముగ్గురు స్త్రీలని సంతోషపెట్టవలసి వచ్చిన మగాడు ఈ జంతువుల్ని బాగా పరిశీలించి వాటి రతివిధానాల నుంచి పాఠాలు నేర్చుకోవడం అవసరం. ఒకే మగవాడితో ఇద్దరు, ముగ్గురు స్త్రీలు ఒకేసారి రతిని పొందడం, ఆ స్త్రీల మనోవికారమూ - ఆ పురుషుడి మనో వికారమూ..... ఏదయినా ఇదొక దుర్గతి! అంతకన్నా దురదృష్టం ఇంకొకటుండదు.

7) వాత్స్యాయనుడు తనకాలంలో గ్రామణక దేశం, అనే దేశం గురించి ఒక కథ చెప్పాడు. ఆ దేశంలో ఆడవాళ్ళు అసామాన్యులు. వాళ్ళు అనేక మంది మగవాళ్ళని పెళ్ళిళ్ళుచేసుకుని తమ ఇళ్ళలో ఉంచుకుంటారు. ఈ అందరినీ ఒకేసారి

కవ్వించి రతికి పిలుస్తారు. ఒక్కొక్కడు ఒక్కొక్క విధమైన పనిచేస్తాడు. ఒకడు స్తన మర్దనం, ఇంకొకడు ముద్దులు పొందడం ఇలా చేస్తూ అందరూ కలిసి ఏకకాలంలో ఆమెని రంజింపచేస్తారు. ఆమెను ఆనందింపచేయడం ఆ మగవాళ్ళ అందరి సమూహ బాధ్యత. వాళ్ళంతా కలిసి ఒకేసారి ఆ బాధ్యతలని నెరవేరుస్తారు. ఈ గోలంతా చిత్తకార్తి కుక్కల సామెతలాగా వుంది. మానవ మాత్రులకు ఇలాంటి దుర్గతి కలగకుందుగాక!

8) చిత్ర రతిలో ఆఖరుగా విరేచన ద్వారంలో రతినిచేసే అలవాటుని ప్రస్తావించాడు వాత్స్యాయనుడు.

"అధోరతం పాయాదపి దాక్షిణాత్యానాం....." అనే సూత్రంలో దక్షిణ దేశీయులు స్త్రీ విరేచన రంధ్రంలో తన అవయవాన్ని దూర్చి రతిని చేస్తుంటారు. భగరంధ్రంలో చేసినప్పుడు వారికి తృప్తికలగదు. దీన్ని ఆంగ్లభాషలో "సోడోమీ" అంటారు.

మొత్తంమీద చిత్రరతులుగా చెప్పిన ఈ విషయాలన్నీ ఆరోగ్యవంతమైన "సెక్సు" అనిపించుకోవు. మనం అన్నీ చదవాలి. అన్నీ తెలుసుకోవాలి. కొన్ని ఎలా చెయ్యాలో తెలుసుకోవడానికి - కొన్ని ఎలా చెయ్యకూడదో తెలుసుకోవడానికి!!

## —— చిరుదెబ్బలు అతిచక్కని శృంగారచేష్ట ——

"కామకలాపం" కూడా ఒక విధమైన ఆటే కదా! ఇది ఇద్దరు స్త్రీ పురుషులు ఏకాంతంగా ఆడుకునే ఆట. అందుకనే దీన్ని "కామక్రీడ" అన్నారు. ఇందులో జరిగే ప్రతి సంఘటన, ప్రతిసన్నివేశం గోల్ దగ్గరకు బాలు చేరినప్పుడు "ఫుట్‌బాల్" అంత ఉత్కంఠగా ఉంటుంది. ఒక బంతి ఒక పరుగు వున్న క్రికెట్ ఆటలా ఉత్సాహభరితంగానూ ఉంటుంది.

ఈ ఆటల్ని ఆడ్తున్నవారు ఆడుతూంటే మనం అంతా చూసి ఆనందిస్తూంటాం. కానీ, కామక్రీడ ఎవరికి వారు ఆడుకునేది. ఎవరి ఆట వారిది. ఆడుకొంటూ ఆ ఆటలోని ఆనందాన్ని వారిద్దరే అనుభవిస్తూంటారు. ఇది ఇతరులకు సంబంధించినదీ కాదు, ఇతరులకు చెప్పుకొనేదీ కాదు.

ఈ ఆటలో ముద్దాటలు, గిల్లుకోవటాలు, కొరుక్కోవటాలూ వుంటాయి. చిన్నచిన్న దెబ్బలు కొట్టుకోవటాలూ వుంటాయి. పందెం అన్నాక ఇలాంటివి సహజం. వాటిని ఆ యిద్దరూ స్పోర్టివ్‌గా తీసుకుంటారు.

చిన్నచిన్న దెబ్బలు వేసుకోవడాన్ని **"ప్రహణణం"** అన్నారు. స్త్రీ పురుషులిద్దరూ ఒకరికొకరు పరస్పరం ఎక్కువ సుఖాన్ని అందించుకోవడంకోసం పోటీపడుతూ, ఒకరికొకరు నొక్కుకుంటూ, రక్కుకుంటూ, తిరస్కరించుకొంటూ, ఎక్కిరించుకొంటూ.....

ఈ కామక్రీడని కొనసాగిస్తుంటారు. అందుకే కామాన్ని సున్నితమైన సుఖాన్నిచ్చే కలహరూపంగా చెప్పారు. "కలహం" అంటే ప్రణయ కలహమే!

"చూస్తాను నీ సంగతి" అని భర్త పొగరుగా అంటే ఆ భార్య ఎంతో సంతోషిస్తుంది..... అది ప్రణయ కలహం అయితే! ఇదంతా ఎందుకంటే ఒకరిమీద ఇంకొకరు ప్రేమను, అనురాగాన్ని, ఆప్యాయతని అభివృద్ధి చేసుకోవడానికే ! రతి సుఖానికి అనురాగం అనేది ఆలంబన. అనురాగం లేనిచోట చేసిన రతి-రతి కాదా..... అది స్వహస్త ప్రయోగం, స్వకుచమర్దనం కన్నా ఎక్కువ నీచమైనదే.

చిరుదెబ్బల్లో స్త్రీలకు ఇబ్బందికల్గించని వాటిని ఇక్కడ చెబుతున్నాడు.

1) పిడికిలి మూసి మధ్య వేలు పక్కనుంచి బొటనవేలు బైటకు వచ్చేలా చేసి, ఆ బొటన వేలితో స్త్రీ రొమ్ములమీద మృదువుగా కుమ్మినట్లు చేస్తే దాన్ని "కీల" అంటారు. కుమ్మడం అంటే "ఢిష్యూం" అన్నట్లుకాదు. అందులో మృదుత్వం వుండాలి. ఆ ప్రహణనానికి ఆమె "ఆహాఁ!" అని ఆనందించాలి. అలా ఆనందించే స్త్రీకే చిరుదెబ్బలు ఇవ్వాలి.



2) ఒకచేతి వేళ్ళని సగంముడిచి, ఆ ముడిచిన వేళ్ళతో కుమ్మిన భద్రకర్తరి అంటారు. రెండు చేతి వేళ్లనూ ముడిచి కుమ్మితే దాన్ని "యుగళ కర్తరి" అంటారు. ఇది తలమీద ప్రయోగించడానికి వీలైన చిరుదెబ్బ (ప్రహణనం).

3) చిటికెన వేలు పక్కనుంచి బొటన వేలుని బైటకు లాగి పిడికిలి మూసి ఆ బోటన వేలితో కుమ్మితే దాన్ని "విద్ధ" అంటారు. ఇది చెంపలమీద ప్రయోగించదగిందిగా వుంటుంది.

4) స్త్రీ రొమ్ముమీద గాని, వాటికి పక్కల గానీ వున్న చర్మాన్ని మునివేళ్ళతో పుచ్చుకొని లాగినట్లు మృదువుగా చేసి చక్కిలిగింతలు పెడితే ఆ స్త్రీ బాగా ఆనందిస్తుంది. "సందంశిక" అంటారు దీన్ని.

ఈ ప్రహణాల్ని కూడా దక్షిణ భారతదేశీయులు ఎక్కువగా ప్రయోగిస్తుంటారనీ, వీటిని ఇక్కడి స్త్రీలు తట్టుకొని బాగా ఆనందిస్తారనీ శాస్త్రం చెప్తోంది.

## —— ఎవరు ఎవరికి చిరుదెబ్బలు వెయ్యాలి ??? ——

మగవాళ్ళ శరీరంలో కాఠిన్యం వుంటుంది. గంభ్రతనం వుంటుంది. ఈ రెండు లక్షణాలూ పౌరుషానికి, తేజస్సుకు సంబంధించినవి. ఇలా లేకుండా ఆడవారి శరీరంలాగా మెత్తగా వుంటే ఆ పురుషుణ్ణి స్త్రీ పూర్తిస్థాయిలో ఆనందించలేకపోవచ్చు. మగశరీరం కఠినంగా వుంటేనే ఆడవారికి అందంగా కన్పిస్తుంది.

అలాంటి కఠిన శరీరం వున్న మనిషి మృదువైన మనసుతో మెత్తటి దెబ్బల్ని స్త్రీ శరీరభాగాల మీద ఉత్తేజాన్ని కల్గించే చోట ప్రయోగిస్తాడు.

ఈ చిరుదెబ్బల్ని తిప్పికొట్టే శక్తి ఆడవారికి ఉండవచ్చు, ఉండలేకపోవచ్చు కూడా ! ఒకవేళ తిప్పికొట్టినా ఆమెకే చెయ్యినొప్పిగాని, అతనికేమీ అన్పించకపోవచ్చుకూడా!

ఒక్కోసారి మగవాడు ముందు తాను కొట్టి, అలా తననూ కొట్టమని అడగవచ్చు. అడిగినా కొందరు సుకుమారులైన స్త్రీలు కొట్టలేకపోవచ్చు. రతి ఉత్తేజంలో ఉన్న ఆమెకు "నిస్త్రాణం" ఆవహించి వుంటుంది కాబట్టి ఆ స్థితిలో ఆమె పురుషుణ్ణి ప్రహణనం చెయ్యలేదు. కానీ మగవాడు ఆమెకు ఉత్తేజం కలిగే శరీర భాగాలమీద తాడిస్తూనే ఉంటాడు. అందుకు ప్రతిగా ఆమె అనేక రకాల శబ్దాలుచేసి తన ఆనందాన్ని ప్రకటిస్తుంది.

ఆనందాన్ని ప్రకటిస్తూ చేసే శబ్దాల్ని "సీత్కృతాలు" అంటారు. వాటిగురించి మనం విడిగా చర్చిద్దాం.

కొంచెం శక్తిమంతురాలయిన స్త్రీ ఓపికచేసుకొని పురుషుడి చిరుదెబ్బను తిప్పికొడ్తూ తానుకూడా ఒక మంచి ప్రహణనం ఇచ్చిందనుకోండి. అప్పుడు ఆ పురుషుడు తన ఆనందాన్ని ప్రకటిస్తూ తానుకూడా 'ఆహా' అంటూ "సీత్కృతం" చేస్తాడు. ఇవన్నీ అనురాగం పెంచుకోవడానికే కదా!!

## —— రతిస్పందనని తెలియచెప్పే శబ్దాలు ——

సృష్టిలోని అన్నిరకాల ఆనందాల్ని మూటగట్టి తెచ్చి కుమ్మరించినట్లు రతి జరిగిన ఆ కొద్దిసేపు అనంతానందాన్ని పొందే స్త్రీ పురుషులు తమ ఆనందాన్ని వెల్లడించుకోవడానికి చేసే రతి శబ్దాల్ని మణికూజితాలు అనీ, కూజితాలు అనీ, సీత్కృతాలు అనీ పిలుస్తారు.

1) పెదాలు బిగించి కంఠంతోనూ, ముక్కుతోనూ, హీ హీ అనో, హు హు అనో చేసే శబ్దాన్ని "హింకారం" అంటారు.

2) ఆ..... ఓ..... అంటూ బిగ్గరగా అరుస్తున్నట్లు చేసే శబ్దాన్ని "స్తనితం" అంటారు.

3) కొందరు చేసే శబ్దం పెద్ద "మూలుగుడు" లాగా వుంటుంది. అలా కావాలని చెయ్యరు. ఆ ఉత్తేజ సమయంలో ఈ శబ్దాలు రకరకాలుగా వాటికవే వస్తాయి. అవి తను రతి జరుపుతున్న విధానం వలన ఆమెగాని, అతడుగానీ ఆనందిస్తున్నాడనడానికి సంకేతాల వంటివి. అవిలేకుండా కేవలం నిశ్శబ్దంగా పడుకున్న వ్యక్తి ఆ రతిని ఆనందిస్తున్నట్టో..... అయిష్టంగా వున్నట్టో అర్థంకాదు. అలాంటి అనుమానం వస్తే రతిని జరుపుతున్న వ్యక్తికి మూడ్ జారిపోతుంది. కాబట్టి ప్రతిస్పందన, ఇద్దరికీ తప్పనిసరి!

4) నిట్టూర్చినట్టు "ష్" అని మరికొందరు శబ్దిస్తుంటారు.

5) "అమ్మ-అమ్మ" అనీ, ఆహా ఆహా అనీ, ఆగు ఆగు అనీ, వద్దు వద్దు అనీ, చాలు చాలు అనీ, చచ్చ చచ్చ అనీ రకరకాల శబ్దాలు ఆ సమయంలో నోటివెంట అలవోకగా వచ్చేస్తుంటాయి. ఇలాగే శబ్దం చెయ్యాలి అనే రూలు లేదు.

6) ఆ సమయంలో కొందరి కూతలు పావురాలు కూసినట్లుంటాయి. కొందరివి కోకిలల కుహుకుహుమని శబ్దిస్తుంటాయి. తితువు పిట్ట, చిలకలు, తుమ్మెదలు, గోరువంకలు..... ఇలాంటి పక్షుల కూతలన్నీ వినవస్తుంటాయి ఆ సందర్భంలో.

7) ఆయా వ్యక్తుల స్వరపేటికలోని శబ్ద స్థాయి (Base) ని బట్టి ఈ కూజితాలు కొందరివి నెమ్మదిగా, స్వల్పంగా, అల్పంగా వుంటాయి. కొందరివి బిగ్గరగా వుంటాయి, పెద్దగా వుంటాయి. పెద్దగా అరిస్తే ఎక్కువ స్పందన, నెమ్మదిగా అంటే తక్కువ స్పందన కల్గిందని అనుకోవడం కూడా పూర్తిగా వాస్తవంకాదని దీన్ని బట్టి అర్థం అవుతోంది.

8) ఈ కూజితాలవల్ల రతిని జరుపుతున్న ఆ ఇద్దరికి మనోహరంగా ఉంటుంది. కూజితం వినిపించినప్పుడు ఆ పనిని మళ్ళీమళ్ళీ చెయ్యాలనుకొంటారు. అతను మళ్ళీమళ్ళీ అదేపనిని చేస్తుంటే, ఆమె మోహనంగా మళ్ళీమళ్ళీ కూజితం చేస్తుంది. ఇలా ఆ ఇద్దరి రతి వ్యవహారం గంటలతరబడీ సాగుతుంది. అలా సాగితేనే కదా....."ఆ ఇద్దరూ రాత్రంతా గడిపారు –" అనే మాటకు సార్థకత ఏర్పడేది !!!

## —— సెక్సులో శాడిజం ——

గిల్లుకోవడం, కొరుక్కోవడం, పొడుచుకోవడం, గుద్దుకోవడం ఇవన్నీ చెప్పిన తర్వాత వాత్స్యాయనుల వారికి ఒక సందేహం కల్గింది. ఈ మనుషులు తనుచెప్పిన సున్నితమైన శృంగార క్రీడల్ని వక్ర భాష్యం చెప్పి కాముకులైన పురుషులు సున్నితమైన స్త్రీలని హింసించి బాధించే తమ స్వభావంతో "రతిహింస"కు తలపడే ప్రమాదం వుంది

కదా..... అని! అందుకని కొన్ని సంఘటనలు ఉదాహరణలుగా చెప్పి, ఎదుటివ్యక్తిని ఆనందింపచేయడమే శృంగారానికి పరమావధిగా వుండాలి గాని, ఎదుటివ్యక్తిని హింసించి తను ఆనందించడం శృంగారం అవదని స్పష్టంగా పేర్కొన్నాడు.

ఆయన చెప్పిన కొన్ని సంఘటనలు :

1) చిత్రసేన అనే సుకుమారిని చోళరాజు మోటుగా కౌగిలించుకొని, ఆమె రొమ్ముల మీద గుప్పెళ్ళు మూసి గట్టిగా గుద్ది ఆనందించాడు. ఆమె అక్కడికక్కడే చనిపోయింది.
2) కుంతల దేశపు రాజు శాతకర్ణి "మలయవతి" అనే తన కొత్త పెళ్ళికూతుర్ని పరవశంతో తలమీద గట్టిగా గుద్ది అనుభవించాడు. ఆ గుద్దుకి ఆమె అలాగే మరణించింది.
3) పాండ్యరాజు సేనాధిపతి నరదేవుడు మోటుగా చిత్రలేఖ అనే నాట్యకత్తెని సంభోగించబోయి, కామాంధుడై ఆమె చెక్కిళ్ళ మీద "విర్ధ" అనే ప్రహణం ప్రయోగించాడు. గట్టిగా బుగ్గల మీద ఆ దెబ్బ తగిలేసరికి ఆమె కళ్ళు రెండూ పోయాయి.

ఇలాంటి శాడిస్టులైన మగవాళ్ళు రతిలో హింసపెట్టి ఆనందిస్తుంటారు. వీడు కొట్టిన దెబ్బలకి ఆమె ఏడవాలి. ఏడిస్తేనే వాడికి తృప్తి. ఇదొకరకమైన మనోవికారం.

అందుకే వాత్స్యాయనుడు ఒక లోకోక్తిని చెప్పాడు - రతికి తలపడేవాళ్ళు రెండు రకాలుగా వుంటారు. కామశాస్త్రాన్ని తెలుసుకొన్నవాళ్ళు, తెలియని వాళ్ళు అని ! కామశాస్త్రం తెలియని వాడికి శృంగారం గురించి, రసాస్వాదం గురించి ఏమీ తెలియనట్టే! కేవలం తాత్కాలికంగా కలిగే కామావేశంచేత తనకు ఎలా తోస్తే అలా చేస్తాడు. వాడికి శృంగార చేష్టలన్నీ అనవసరం. ఏదో ఆ కొద్దిక్షణాలు గడిపేస్తే వేడి దిగిపోతుంది. మిగతాదంతా "టైంవేస్ట్" అనుకొంటాడు.

కామశాస్త్రం తెలిసిన వాడు జ్ఞాని! అతని అనురాగానికి విచక్షణ వుంటుంది. అతను సంగమించే స్త్రీ సౌకుమార్యాన్ని అతను అంచనా వేయగలుగుతాడు. ఎంత తీవ్రంగా ప్రయత్నిస్తే ఆమె ఎంతచక్కగా ప్రతిస్పందించ గలుగుతుందో అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తాడు. అందుకు తగ్గట్టుగా ఆమెను ఆనందింపచేయాలని చూస్తాడు. అతని చేతలకు ఆమె చక్కని ప్రతిస్పందన నిస్తుంది. ఆ ప్రతిస్పందనతో ఆమె చేసే చేష్టలు అతనికి ఆనందాన్నిస్తాయి. ఆ ఆనందంతో అతను మరిన్ని చేష్టలు చేస్తాడు. ఇలా ఆ యిద్దరూ ఒకరినొకరు ఆనందింపచేసుకొంటూ సుదీర్ఘకాలం రతిలో గడపగలుగుతారు. ఆఖరున భగలింగ ప్రవేశంచేసి సంభోగ క్రియని ముగిస్తారు. భగలింగాల మధ్య జరిగే సంయోగం అనేది కొన్ని నిమిషాలకే పరిమితమైన ప్రక్రియ. దాన్ని ఆఖరున జరపాలి.

మిగిలిన సమయాన్నంతా శృంగార చేష్టలతో ఉత్తేజితంగా గడపాలి. ఈ మొత్తం ప్రక్రియని "రతి" అంటారు.

"రతి" సమయంలో చేసే చేష్టలు ఎవరికి వాళ్ళు అప్పటికప్పుడు ఆ ఆవేశంలో కల్పించుకొనే విలాసాలే! ఇలా చెయ్యాలని ఊహించి మొదలుపెట్టినంత మాత్రాన అలాగే జరగాలని లేదు. కొత్తగా ఎవరికి వారు తమంత తామే అనేక చేష్టల్ని సృష్టించుకొంటూ వుంటారు! శాస్త్రంలో చెప్పినవి కొన్ని మార్గదర్శక సూత్రాలు మాత్రమే! ఆనందమే పరమావధిగా ఎవరిష్టం వారిదిగా శృంగార చేష్టల్ని ప్రయోగించుకోవచ్చు.

వాయువేగంతో ఎగిరిదూకుతూ పరిగెత్తే గుర్రానికి ఎదురుగా రాళ్ళు, రప్పలూ అడ్డాలుంటాయనే స్పృహ ఎలా వుండదో అలాగే, రతి వేగంలో పడ్డాక స్త్రీ పురుషులు ఒళ్ళు తెలియని వేగంతో ప్రవర్తిస్తారు. సరిగ్గా ఆ సమయంలో కాలింగ్ బెల్ మోగినా వారికి విన్పించని స్థితిలో వుంటారు.

అందుకని శాస్త్రం చెప్పిన మార్గంలో అవసరాన్ని, అవకాశాన్ని బట్టి, మృదువుగా ప్రవర్తించాలో, వేగంగా ప్రవర్తించాలో నిర్ణయించుకొని, తన బలాన్ని తన భాగస్వామి బలాన్ని పరీక్షించుకొని అందుకు తగ్గట్టుగా వ్యవహరించాలి. ఇది కామశాస్త్ర తత్త్వ రహస్యం. దీన్ని సరిగా అర్థం చేసుకొన్నవాడు ఎన్నటికి కామాంధుడిగా, శాడిస్ట్‌గా ప్రవర్తించలేడు. ఇదీ కామశాస్త్ర ప్రయోజనం.

## —— మగాడికి మూడ్ తెప్పించడం ఎలా ? ——

రతిలో ఆడవాళ్ళు ప్రధానంగా అలిసిపోతారనీ, మగాడు మళ్ళీమళ్ళీ తయారౌతాడనీ కొందరికి ఒక అపోహ వుంది ఇది తప్పు. ఇద్దరూ అలిసిపోతారు. శృంగార చేష్టలు మొదలు పెట్టి, రెండోసారికూడా ఎక్కువసేపు ఉత్తేజాన్ని కొనసాగించేందుకు స్త్రీ పురుషులిద్దరూ ఒకరికొకరు సహకరించుకోవాలి. పురుషుడిలో ఉత్తేజాన్ని కొనసాగించేందుకు స్త్రీ చేసే పనుల్ని పురుషోపసృప్తాలంటారు.

అతనికి బాగా ఇష్టంగా వుందని అనుకున్నప్పుడు ఆ స్త్రీ అతని పురుషావయవంలో తిరిగి ఉత్తేజాన్ని కల్గించి, స్తంభనాన్ని ఎక్కువసేపు కొనసాగించడానికి, పదేపదే అతను రతికి తలపడేలా ప్రోత్సహించేందుకు ఈ "పురుషోప సృప్తాలు" ఉపయోగపడతాయి.

1) త్వరగా ముగిసిపోయే మగవాడితో సంగమించే స్త్రీ అతను సంభోగానికి అనర్హుడు అనుకోవడమో, అతనివలన తనకు సుఖం సరిపోదని భావించడమో జరిగితే ఆ యిద్దరి సంసారంలో ఎడం పెరుగుతుంది. అందుకని, అతని ఉత్తేజాన్ని ఇంకా ఎక్కువసేపు కొనసాగించడంకోసం ఆమె ప్రయత్నించాలి. అందుకు ఆమె అతనికి

సహకరించాలి కూడా! ఇదే నియమాన్ని స్త్రీ విషయంలో పురుషుడుకూడా అనుసరించాలని అన్వయించుకోండి!

2) ఎంతసేపటికీ మూడ్‌లోకి రాలేకపోవడం, అంగస్తంభనం కలగకపోవడం వంటివి ఎంతటి సమర్థుడైన పురుషుడికైనా ఒక్కోసారి సంభవించవచ్చు. అంతమాత్రాన ఇంక అతని మగతనం పోయిందని అతని స్త్రీ భావించుకోనవసరంలేదు. అతనిలో "మూడ్స్"ని రగిలించేందుకు ఆమె చెయ్యవలసినదంతా చెయ్యాలి. అది ఆమె బాధ్యతకూడా!

3) రతిక్రియ ఒక రాత్రి రెండు మూడు సార్లు జరగాలని కోరుకున్నప్పుడు, ఉపశమించిన పురుషావయవాన్ని తిరిగి స్తంభింపచేయడానికి స్త్రీ సహకరించవలసి వుంటుంది కూడా! తన మాటలతో అతనివలన కలిగిన ఆనందాన్ని ప్రశంసిస్తూ, తన చేతలతో అతన్ని రెచ్చగొడుతూ మళ్ళీ "ఇంకోసారి" అతను "రతి"కి తలపడేలా తనదారికి అతన్ని తెచ్చుకోవాలి. ఇందుకోసం స్త్రీలు ఆచరించవలసిన కొన్ని విషయాల్ని వాత్స్యాయన మహర్షి ఇక్కడ సూచిస్తున్నాడు.

   ఎ) తలలో పూలు విడిపోయేలా చేసిన, అవి అతని ముఖానికి తగిలి వాటి సువాసనకు అతనిలో ఉత్తేజం కల్గించవచ్చు.

   బి) అతని పెదాలను తన పెదాలతో అందుకుంటూ, ముద్దుపెడుతూ తన రొమ్ములతో అతని వక్షస్థలాన్ని నొక్కుతూ అతన్ని రెచ్చగొట్టాలి.

   సి) ఎంత చేస్తున్నా, చేసేది చేస్తూనే సిగ్గుపడ్తున్నట్లు కన్పించాలి. కులకాంతకు సిగ్గు అలంకారం కదా! సిగ్గులేకుండా ప్రవర్తిస్తోందని మగవాడు ఒక్కోసారి నిందలేస్తుంటాడు కూడా! అందుకని, రతి కార్యక్రమంలో ఎంత స్వేచ్ఛననుభవించినా, స్త్రీ సిగ్గుని మాత్రం వదలకూడదు.

   డి) అతను తన మీద ఎలాఎలా, ఏమేమి చేశాడో అవన్నీ తానూచేసి కసి తీర్చుకొంటున్నట్లు చెయ్యాలి.

   ఇ) అతడు శృంగారంలో గిల్లి, కొరికి, కొట్టి ఎన్ని బాధలు పెట్టాడో అన్నీ తానూ అతన్ని పెట్టాలి. అవి అతనికి ఉత్తేజాన్నిస్తాయి. అతను మరోసారి రతికి సిద్ధపడేలా చేస్తాయి.

   ఎఫ్) పురుషుడు చేసే శృంగార చేష్టలన్నీ స్త్రీ చేయడాన్ని "పురుషాయితం" అంటారు. చివరికి "స్త్రీ" పైన వుండి, పురుషుడు అడుగున వుండి స్త్రీ చేసే రతిని అభ్యంతర పురుషాయితం అనికూడా అంటారు.

## —— ఆమెకు మూడ్ లేనప్పుడు అతనేం చెయ్యాలి ? ——

1) ఆమెను మాటల్లోకి దింపుతూనే కోకముడి వూడదీయాలి. ఆవిడ వద్దంటూనే ముడుచుకొని విసుగ్గా చూస్తుంది.

2) బుగ్గమీద ముద్దులతో నింపాలి.

3) ఆమెకన్నా చాలా ముందుగానే మగవాడు సాధారణంగా మూడ్‌లోకి వచ్చేస్తాడు. స్తంభించిన తన జననాంగంతో ఆమె చేతులమీదా, భుజాలమీదా, కంఠ భాగంలోనూ, స్తనాల మీదా, తొడల మీదా, ఆమె జననాంగం మీదా తాకాలి.

4) తనతో సంగమించే స్త్రీతో అతనికి బాగా చనువున్నప్పుడు ఎక్కువ చొరవ తీసుకొని ప్రవర్తించాలి.

5) స్త్రీకి మంచి మూడ్ వచ్చిందని ఎలా తెలుస్తుందంటే, వాళ్ళకు భావప్రాప్తి కల్గినప్పుడు శరీరం జారిపోవడం, కళ్ళు మూతలు పడిపోయినట్లవడం, సిగ్గుపడే అవకాశం లేకపోవడం, ఎక్కువ రతికోసం పురుషుణ్ణి హత్తుకోవడం..... ఇలాంటివి చేస్తారు. ఒక్కొక్కరూ తమ మూడ్‌ని ఒక్కోరకంగా వ్యక్తపరుస్తారు. మగవాడు ఆమె స్పందనల్ని పసిగట్టి తదనుగుణంగా ప్రవర్తించాలి.

6) ఒక్కోసారి ఆమె కళ్ళుమూసుకొని తలకాయిని ఏదో ఒక పక్కకు తిప్పుకొంటుంది. ఆమె నాడీ స్పందన అంతా ఆ భాగంవైపు ఎక్కువగా సాగుతోందన్నమాట. అలాంటిదేమైనా గమనించినప్పుడు ఆ వైపున ఆమె శరీరభాగాల్ని ఎక్కువగా తాకుతూ రెచ్చగొట్టాలి.

7) ఏఏచోట్ల స్పృశిస్తే ఆమెకు ఎక్కువ ప్రీతిపాత్రంగా వుంటుందో తెలిసిన భర్త ఆచోట్లలో తాకుతూ, స్తనాలను మర్దిస్తూ రతిని కొనసాగించాలి.

8) ఏ స్త్రీ తన శరీరమంతా చెమటతో తడిసిపోతూ, అతన్ని కదలనీకుండా హత్తుకొని కరుచుకుపోతుందో, పంటితో కొరకడం, తీవ్రంగా ముద్దాడడం, అంతకు మునుపటికన్నా ఎక్కువగా ప్రతిస్పందించడం చేస్తుందో, తన పాదాలతో అతని పాదాలను నొక్కుతుందో, అతని జననాంగాన్ని తాకడం, ముద్దాడడం చేస్తుందో..... అప్పుడు ఆమె మంచి మూడ్‌లోకి చేరినట్టు లెక్క ! ఇలా మూడ్‌లోకి వచ్చేవరకూ తన శృంగార చేష్టలతో ఆమెని బాగా రెచ్చగొట్టి, అప్పుడు "రతి"కి తలపడడం వలన, ఆ స్త్రీని ఎక్కువసేపు ఆనందింపచేసిన వాడు అవుతాడు పురుషుడు.

## —— రతిలో స్త్రీని జయించే చిన్న టెక్నిక్ ——

ఆమెను ముందు బాగా మూడ్‌లోకి తెచ్చేందుకు చేయవలసిన శృంగార చేష్టలన్నీ చెయ్యాలి. బాగా మూడ్ వచ్చిన తర్వాత ఆమె సర్వం అర్పించుకోవడానికి సిద్ధపడ్తుంది. అప్పుడు ఏనుగు తన తొండంతో ఆడ ఏనుగు జననాంగాన్ని స్పృశించినట్లు మగవాడు తన చేత్తో ఆమె జననాంగాన్ని తాకాలి. అరచేత్తో జననాంగం మొత్తాన్ని పట్టి బంధించాలి. అటూ ఇటూ గట్టిగా నొక్కుతూ దాన్ని కదల్చాలి.

స్త్రీ జననాంగం లోపల కొంతభాగం తామర ఆకులాగా వుంటుంది. మరికొంత భాగం మెలితిరిగి వుంటుంది. మధ్యలో ఒకచోట ఆవు నాలికలాగా గరుకుగా కూడా వుంటుంది.



ఇందులో మొదటిభాగాన్ని అరచేతితో తాకితే స్త్రీకి సంతోషదాయకంగా ఉంటుంది. ఉంగరం వ్రేలునీ చూపుడు వ్రేలునీ దగ్గరగా చేర్చి ఆ రెండు వేళ్లతో యోనిని తాకి, దాన్ని అటూ ఇటూ కదిలిస్తే అద్భుతమైన ఉత్తేజం కలుగుతుంది స్త్రీకి. ఈ రెండు వేళ్ళకూ గాయాలూ, పుళ్ళు లేకుండా చూసుకోవాలి. శుచిగా శుభ్రంగా చేతులు సబ్బుతో కడుకొన్నవాడై వుండాలి. ఈ వ్యక్తి తన ఉంగరం వేలునీ, చూపుడు వేలునీ కలిపి యోనిలోకి ప్రవేశపెట్టి బాగా షేక్ చేసినట్టు కదిలిస్తే అమరలోకాలను చూసినంత ఉత్తేజాన్ని పొందుతుంది స్త్రీ. అన్నట్లు, ఇలా చేసేటప్పుడు పొడవైన గోళ్ళు లేకుండా వుండాలి. ఎడమచెయ్యిని ఉపయోగించడం మంచిది.

## —— యోని లోపల పురుషావయవంతో రకరకాల రతి చేష్టలు ——

భార్యాభర్త లిద్దరూ కాళ్ళు బారచాపుకొని ఒకరిపైన ఇంకొకరు పడుకొని ఇద్దరి జననాంగాల మధ్య ఏమాత్రం ఖాళీలేనంతగా కలిసిపోయి గట్టిగా అదుముకొని పడుకోవడాన్ని సంపుటం అంటారు.

అలా అదిమిన తర్వాత యోనిలోపలికి పురుషావయవాన్ని ప్రవేశపెట్టి లోపల పురుషుడు రకరకాలైన రతిచేష్టలు చేస్తాడు. వాటిని ఇక్కడ చెప్తున్నాడు.

చేత్తో తన లింగాన్ని పుచ్చుకొని, ఆమె భగ ప్రాంతాన్ని తాకిస్తూ లోపలా, బైటా తిప్పడాన్ని "మంధనం" అంటారు. - ఒక్కసారిగా లింగాన్ని యోని లోపలికి తోసి గట్టిగా పొడవడాన్ని "హులం" అంటారు. అదేపనిగా పొడవడాన్ని "మర్దనం" అంటారు. యోనిలోపలికి లింగాన్ని తోయగలిగినంత మేర తోసి బలంగా అదిమిపెట్టి ఉంచడాన్ని "పీడితకం" అంటారు. దీన్ని అలా అదిమి ఒక్కసారిగా వెనక్కి లాగి, మళ్ళీ వేగంగా లోపలికి తొయ్యడాన్ని "నిర్ఘాతం" అంటారు. నిలువుగా కాకుండా, పురుషావయవాన్ని యోనిలోపల ఒక పక్కగాతోసి నొక్కడాన్ని "వరాహఘాతం" అంటారు. ఒకసారి ఇటుపక్కకూ, ఒకసారి అటుపక్కకూ యోనిలోపల తన జననాంగంతో పొడిచినట్లు చెయ్యడాన్ని వృషాఘాతం అంటారు. లింగాన్ని బైటకు తియ్యకుండా మూడు నాల్గుసార్లు ఇలా రెండు పక్కలకూ పొడవడాన్ని "చటకవిలసితం" అంటారు. ఇవన్నీ రతిలో ఎక్కువసేపు నిలబడగలిగిన పురుషుడు ఆచరించగలుగుతాడు. త్వరగా ముగిసే వాళ్ళుకూడా ఇలాంటివి చేయడానికి ప్రయత్నించాలి. మొదట మానసికంగా అందుకు సన్నద్ధంగా వుండాలి. ఇలా నేనుకూడా చెయ్యగలననే మనోధైర్యమే విజయాన్ని సాధిస్తుంది.

## —— పురుషావయవంతో స్త్రీ చేయదగిన రతి చేష్టలు ——

1) పురుషుణ్ణి రతిలో రెచ్చగొట్టాలంటే స్త్రీ మొదటగా చెయ్యగలిగిన పని అతని శరీరంమీద వున్న గుడ్డల్ని ఒక్కొక్కటే వూడదీయడం..... ఇక్కడితోనే అతనిలో ఉత్తేజం మొదలౌతుంది.

2) అతని జననాంగాన్ని ఆమె తన చేత్తో పట్టుకొని దానితో తన "భగం" పైన రాపిడి కల్గిస్తూంటే అతనిలో ఉత్తేజం ఎక్కువౌతుంది. ఈ చేష్టని ఆమె చేస్తోంది కాబట్టి అతనికి ఉద్రేకం వస్తుంది. అతను చేస్తే ఆమెకు ఉద్రేకం వస్తుంది. దీన్ని "సంరంగం" అంటారు.



3) అతన్ని పైకి చేర్చి అతని లింగాన్ని భగంలోకి ప్రవేశపెట్టుకొని అతన్ని కౌగిలించుకొని అటూఇటూ రెక్కలాడ్చే పక్షిలాగా, వూగుతూ కదలడాన్ని భ్రమరకం అంటారు. అప్పుడు భర్త ఆమెకు మరింత ఆనందం కలగడంకోసం నడుము పైకెత్తితే, ఈ రతిచేష్టని ఇంకా ప్రోత్సహించినట్లవుతుంది.

4) పురుషుడు చేసినట్లే స్త్రీ తన భర్తపైకి చేరి రతిని చేస్తే దాన్ని ప్రేంఖోవితం అంటారు. ఇలాంటప్పుడు సాధారణంగా అతను ఏఏ పనులుచేస్తాడో అవన్నీ ఆమె తన భర్తపైన ప్రయోగించాలి. పురుషాయితంలో ఈ విధానాలు ఎక్కువ ఆనందాన్ని కల్గించేవిగా వుంటాయి.

స్త్రీ సహజంగా ముడుచుకుపోయే స్వభావం కలిగి వుంటుంది. రతి భావన కలిగితే చాలు సిగ్గుమొగ్గయిపోతుంది. కానీ! పురుషాయిత సమయంలో ఆ సుఖభావంచేత మైమరచి తన హృదయాన్ని భర్త దగ్గర ఏమాత్రమూ దాచకుండా బైటపడ్తుంది! అందుకని, భార్యచేతకూడా రతిచేయించడం, అలాచేయవలసిందిగా ప్రోత్సహించడం అవసరం. కొందరు స్త్రీలకు అలా తానుకూడా పైకిచేరి రతినిచెయ్యాలని మనసులో వుంటుంది. కామశాస్త్రం తెలిసిన పురుషుడు దాన్ని ఆమోదిస్తాడు. ఆనందిస్తాడు కూడా! శాస్త్రం తెలియనివాడూ, రసికతలేనివాడూ, మగాడిలా ప్రవర్తిస్తోందని ఈసడించవచ్చు. అలా ఈసడిస్తాడేమోననే అనుమానం భార్యకు సహజంగా వుంటుంది. అందుకని, భర్త చొరవచేసుకొని, ఆమెను తనపైకి లాక్కుని అదేవిధంగా చేయవలసిందిగా ఆహ్వానించి ప్రోత్సహించడం అవసరం!

ఇంతాచెప్పి ఆఖరికి ఒక గొప్ప సూత్రం చెప్పాడు వాత్స్యాయనుడు.

"యథాశీలాభవేన్నారీ, యథాచ రతి లాలసా, తస్యాఏవ విచేష్టాభి స్తత్సర్వ ముపలక్షయేత్" తన స్త్రీ స్వభావం ఎలాంటిదో, తన స్త్రీ కోరికలు ఎలాంటివో, తన స్త్రీ ఏ పనిని ఇష్టపడ్తుందో గ్రహించి, ఆమేరకు ఆమెను తృప్తిపరచడం భర్త బాధ్యత.

ఎలా రమిస్తే తన భార్య శీలవతిగా వుంటుందో, ఎలా రమిస్తే తనమీద మరింత ప్రేమను, మక్కువను కలిగి ఉంటుందో ఆ ఉపాయాన్ని ఆమె ఇష్టాలకు తగినట్లుగా గ్రహించి ఆమెను తృప్తి పరచాలి.

ఆమె ఇష్టాన్ని గ్రహించకుండా తన దారిన తాను ఏకపక్షంగా రతిని కొనసాగిస్తే, ఆ మగవాడి భార్య, తన స్వంత ఇష్టాల్ని తీర్చుకోవడం కోసం శీలం తప్పే ప్రమాదం వుందనే హెచ్చరిక ఇందులో వుంది.

కామశాస్త్రం అంతా ఇలాంటి ప్రమాదాల్ని నివారించడానికేనని అర్థం చేసుకోవాలి!

## —— కొత్త పెళ్లికూతురితో ఎలా ప్రవర్తించాలి ? ——

కొత్తగా భార్యా భర్తలయిన తర్వాత, భర్త తన నవ వధువుతో చనువును పెంచుకోవాలి. తనపైన నమ్మకాన్ని కల్గించాలి. తానూ ఆమెపైన నమ్మకాన్ని పెంచుకోగలగాలి.

సిగ్గూ, భయం వదిలించి తనకు అనుకూలత సాధించుకోవడం కోసం "కొత్త భర్త" కొత్త భార్యతో వ్యవహరించవలసిన కొన్ని విధానాల్ని సూచిస్తున్నాడు వాత్స్యాయన మహర్షి.

1) మధురంగా పలకరించాలి.
2) ఏకాంతంలో కలుసుకోవడానికి ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వాలి.
3) వీలు చూసుకుని కాళ్లు, చేతులు తగిలిస్తూ, ఆమె శరీరాన్ని తాకేందుకు ప్రయత్నించాలి.
4) మృదువుగా ఆమెతో వ్యవహరించాలి. మొదటి రోజే ఆమె భయపడిపోయేలా తన చేష్టలతో భయకంపితురాల్ని చేయకూడదు.
5) ఇలాంటి ప్రయత్నం ఏదీ చెయ్యకుండా గుంభనంగా మగవాడు వుండిపోయాడనుకోండి – "వీడెవడో ప్రపంచజ్ఞానం లేని మూర్ఖుడిలాగా వున్నాడు. ఇలాంటి వాడి చేతుల్లో పడ్డానేమిటో.....?" అని ఆ అమ్మాయి బాధపడే అవకాశం వుంది. అందుకని తొలి పరిచయాల్ని రసరమ్యంగా ప్రారంభించవలసిన బాధ్యత ఏప్పుడూ మగవాడిదే ననేది మహర్షి అభిప్రాయం.

అయితే పెద్దల ఆమోదం పొందేవరకూ "బ్రహ్మచర్య భంగం" చెయ్యకుండా వుండడం అవసరం అని మగవాణ్ణి స్పష్టంగా హెచ్చరించాడు మహర్షి. అంటే,

స్త్రీలు సుకుమారంగా వుండటమే కాదు, సుకుమారంగా ఆలోచిస్తారు కూడా! పువ్వులాంటి స్త్రీల మనసు పువ్వులానే మెత్తగా వుంటుంది కాబట్టి వాళ్ళతో సుకుమారంగానే వ్యవహరించాలి. బలవంతంగానూ, మోటుగానూ అధికార దర్పంతోనూ, అహంకారంతోనూ, పొగరుగానూ ప్రవర్తిస్తే ఆమెకు "రతి భయం" పట్టుకొంటుంది. సామ, దాన, భేద, దండోపాయాల్లో స్త్రీవిషయంలో, "సామ" ఉపాయంతో సామ్యంగా కథని నడిపించుకోవాలి.

అయినా పెళ్ళి అయిన కొత్తల్లో అమ్మాయిని కలుసుకోవడానికి అబ్బాయి పడే అవస్థలుంటాయే..... అవి ఆజన్మాంతం తీపిగుర్తులుగా మిగిలివుంటాయి.

1) కావులించుకోగలిగేంత అవకాశం దొరికినప్పుడు కొత్త భార్యని కావులించుకోవాలి..... కానీ, పూర్తిగా గాఢాలింగనంలాగా కావులించుకోకూడదు. నడుము నుంచీ పైభాగం మాత్రమే ఆమెకు తగిలేలా ఆ కౌగిలింత వుండాలి. అది ఆమెకు ఇష్టంగానూ, సుఖంగానూ వుండాలి. కొంచెం చనువున్న స్త్రీ అయితే వెలుతురులో ఇలా చేసినా అంగీకరిస్తుంది. కానీ, పూర్తిగా కొత్త వ్యక్తి అయితే చీకటిలో చేయడానికే ఇష్టపడ్తుంది.



2) తన నోటితో తాంబూలాన్ని ఆమె నోటికి అందించడం, తియ్యటి మాటలు, జోకులూ, అసభ్యత లేని శృంగారపరమైన హాస్య సంభాషణలూ, సినిమా డైలాగులూ చెప్పి నవ్విస్తూ తనవైపుకు రప్పించుకోవాలి.

3) మరిపించి, మురిపించి ఒప్పించాలేగానీ, ఇలాచెయ్యి, అలా చెయ్యి అని ఆదేశించకూడదు.
4) అవసరం అయితే కాళ్లమీద పడి బతిమాలుకోవాలి.
5) చిన్నపాటి ముద్దు పెట్టుకోవాలి. ఇష్టం అయితే "ఈ" వేలుపుచ్చుకో ఇష్టంలేదంటే "ఆ" వేలుపుచ్చుకో అంటూ ప్రోత్సహించాలి. పొరబాటున కూడా ఏ స్త్రీ ఇష్టంలేదనే వేలుని పుచ్చుకోదు. ఇష్టమేననే వేలుని కూడా పుచ్చుకోకపోవచ్చు. కానీ, ఇష్టంలేని వేలుని పుచ్చుకోలేదు కాబట్టి ఇష్టమేనన్నమాట..... అంటూ ఆమెను దగ్గరకు తీసుకొని తేలికగా, మృదువుగా ముద్దాడాలి.
6) "కొత్త ముద్దు" పెట్టుకొనేప్పుడు చప్పుడు చెయ్యకూడదు. ఆమె ఏమీ మారు మాట్లాడకుండా మౌనంగా, సిగ్గుతో తలవంచుకొని ఊరుకొంటుంది. ఆమెను చల్లని మాటల్తో మాట్లాడించడానికి ప్రయత్నించాలి! తనంటే ఇష్టమైతే కుడి బుగ్గమీద, ఇష్టం లేకపోతే ఎడమ బుగ్గమీద ముద్దు పెట్టుకోమని అడగాలి. ఇలాంటివి ఆమెను స్వాధీనం చేసుకోవడానికి ఉపయోగించే చక్కని సాధనాలు. రసరమ్యంగా వుంటాయి.
7) కొత్త పెళ్ళికూతురు కౌగిలింతకు ఎంతకూ ఒప్పుకోకపోతే, నా పెదవుల్ని నేనే కొరుక్కొని, నన్ను నేనే గిల్లుకొని ఇవన్నీ నువ్వే చేశావని మీ ఫ్రెండ్స్‌కి చెప్తాను-" అని బెదిరించమంటాడు వాత్స్యాయనుడు.....
8) ఇలా రెండు మూడు రాత్రులు తనమీద నమ్మకం బాగా పుట్టించగలిగితేనే కొత్తగా కాపురానికి వచ్చిన స్త్రీలు తమ భర్తలకు స్వాధీనులు అవుతారు గానీ, హడావిడి హడావిడిగా అప్పటికప్పుడు ఆ "కాస్తపనీ" కానిచ్చేయాలనుకొంటే రసభంగమే అవుతుంది. అయినా ఆ బతిమాలుకోవడంలోని ఆనందం జీవితం అంతా తీపిగుర్తుగా మిగిలివుంటుంది కదా!!
9) రతికి అంగీకరించిన కొత్త పెళ్లికూతురు కొంత చనువుకు అవకాశం ఇస్తుంది. అంతమాత్రాన అప్పుడే తొందరపడకూడదు మగవాడు. ముందు ఆమె స్తనాల మీదకు చేతులు పోనివ్వాలి. నెమ్మదిగా శరీరం అంతా తడుముతూ తొడలమీదకు చేతులు చేర్చాలి. అక్కడ తేలికగా స్పృశిస్తూ చేతుల్ని మూలల్లోకి, జననాంగం మీదకు పోనివ్వాలి.
10) ఇలా చేస్తుంటే ఆ కొత్త పెళ్ళికూతురుకి ఇదంతా వింత అనుభూతినిస్తుంది. ఇది తప్పేమో..... అనే భావన కూడా కలగవచ్చు. అలాచేస్తుంటే ఆమె అడ్డుచెప్తే, ఇందులో తప్పేమీ లేదని అంగీకరింపచేయాలి. ఆమె తోడలమీద ముద్దుపెట్టి మురిపించాలి.

11) ఇవన్నీ ఆ మాటలూ ఈ మాటలూ చెప్పి చెయ్యాలి. అంతేగాని ఇదే పనిపెట్టుకొని కావాలని చేస్తున్నట్లు వుండకూడదు. తొందరపాటు వలన కొత్త పెళ్లికూతురు బెదిరిపోవచ్చు.

12) "కన్యాభావం"లో వున్న యువతిని ఆ భావంలోంచి బైటకు తీసుకురావడానికి మగవాడు కొంత శ్రమపడితీరాలి..... అవన్నీ మధుర స్మృతులుగా మిగిలివుంటాయి. దీన్ని కన్యా విస్రంభణం అంటారు.

13) కన్యా విస్రంభణం వలన ప్రణయ వృద్ధి కల్గుతుందంటాడు మహర్షి. ఆ భార్యా భర్తలిద్దరి మధ్య ఒకరిమీద ఒకరికి విడదీయలేనంత అనురాగం కలగడానికి ఈ చర్య తోడ్పడుతుంది. ఆమెకు అతను అత్యంత ప్రీతిపాత్రుడు కావడానికి ఇది బాగా సహకరిస్తుంది "అక్షతయోని" అంటే, అంతకుమునుపు పురుష సంపర్కం ఎరుగని స్త్రీ సిగ్గుతో కార్యం గదిలో తన భర్తకు పూర్తి అవకాశం ఇవ్వలేకపోవచ్చు. అలా ఇవ్వలేని స్త్రీతో ఎలా వ్యవహరించాలో మాత్రమే ఇక్కడ చెప్పాడు. అలాగని, స్త్రీలంతా ముడుచుకునే స్వభావం కలిగివుండాలనే రూలేమీ లేదుకదా..... ఒకవేళ ఇంతగా బెట్టు చెయ్యకపోతే తన భార్యకు ఎవరితోనైనా పూర్వపరిచయం వుందేమోననే అనుమానించ నవసరం లేదని, అది ఆయా వ్యక్తుల మానసిక స్థితి మీద ఆధారపడి వుంటుందనీ మహర్షి స్పష్టీకరిస్తున్నాడు. ఆమాటకొస్తే సిగ్గుపడిన వారంతా పతివ్రతలనడానికీ వీల్లేదు. సిగ్గుపడని వాళ్ళు సిగ్గులేని వాళ్ళనీ కాదు.

భర్త అనేవాడు తన కొత్త పెళ్లికూతురు చిత్తవృత్తిననుసరించి నడుచుకోవాలని చెప్పడమే ఇక్కడ ముఖ్య ఉద్దేశం. విసిగి ఉపేక్షించేవాణ్ణి, తొందరపాటు ప్రదర్శించే వాణ్ణి ఆమె ఎన్నటికీ క్షమించదు. పైపెచ్చు ద్వేషాన్ని పెంచుకునే ప్రమాదం కూడా వుంది. ఇలాంటప్పుడు కలిగే ప్రేమ, ద్వేషాలు యావజ్జీవితమూ నిలబడిపోయి వుంటాయి. అబ్బాయిలూ..... మొదటి రాత్రే..... జాగ్రత్తగా వ్యవహరించండి !!

## —— ఎలాంటి మగవాణ్ణి పెళ్ళాడాలి ? ——

1) ఎవడు తనని సుఖపెడతాడో వాణ్ణి పెళ్ళాడాలి. కామశాస్త్రం అంతా తెలిసి, అన్ని రకాలుగానూ సుఖపెట్టగలవాడే తనకు తగినవాడు.

2) ఎవడు తన మనసెరిగి తనకు అనుకూలంగా వుంటాడో వాడు ఆమెకు తగిన మొగుడు.

3) ఎవడు తనకు వశుడై తన కోరికలకనుగుణంగా నడుచుకుంటాడో వాడు తగిన మొగుడు.

4) అంతేగాని, అందాన్నిచూసి, ఆస్తుల్నిచూసి మాత్రమే వరించడం మంచిది కాదు.

5) యోగ్యుడు, గుణవంతుడు, అనుకూలుడూ, సమస్త కార్యాలలో సమర్థుడు, ఏకాంతంగా తనను కోరేవాడు, రకరకాల ఉపాయాలతో తనను ఆనందపరిచేవాడు వరుడుగా దొరికినపుడు ఆ సంబంధాన్ని వదులుకోకూడదు.

6) అనేకమంది స్త్రీలతో సంబంధాలున్నవాడు మొగుడుగా దొరికితే తిండిపెడతాడు, డబ్బిస్తాడు, ఇల్లిస్తాడు. అన్నీ ఇస్తాడు – ఒక్క "విస్రంభ సుఖం" తప్ప! అలాంటప్పుడు ఆ సుఖం కోసం అడ్డదారులు తొక్కి కుతి తీర్చుకోవాల్సి వస్తుంది. ఇలాంటి నిష్క్రియా పరుడైన కాముకుడితో, తిరుగుబోతుతో సంసారం చేసేకన్నా, తనకు అనుకూలుడిగా వుండి, వున్నంతలో కుటుంబాన్ని సమర్థంగా పోషించుకోగలిగే పేదవాడే "మేలు"!

7) తనకన్నా తక్కువ జాతికి చెందినవాడు, తనకన్నా వయసులో చాలాపెద్దవాడు, విదేశాల్లో వుండేవాడు..... ఇలాంటి వాళ్ళని భర్త స్థానంలోకి తేవద్దని వాత్స్యాయనుడు చెప్తున్నాడు.

8) ఘోషాబండిలో ముసలమ్మ కూర్చున్నా తొంగిచూసే మనస్తత్వం వున్నవాడు, పమిట కొంగు కనిపిస్తేచాలు వెంపర్లాడి పోయేవాడు, నిగ్రహించుకోవడం అలవాటు లేనివాడు, అతిగర్వి, తాగుబోతు, జూదం ఆడేవాడు..... వీళ్లంతా మైథునం చెయ్యడానికి ఏమీ వుండనివారనీ, ఇలాంటి వారిని జాగ్రత్తగా పరిశీలించాకే సంబంధం కలుపుకోవాలనీ మహర్షి హెచ్చరించాడు.

9) సమాన గుణాలున్న రెండు సంబంధాలు ఒకేసారి వచ్చినప్పుడు ఆ ఇద్దరిలో ఎవరు తనను స్వయంగా వరించేలా ప్రేరేపించగలుగుతాడో వాడే శ్రేష్ఠుడు. అంటే గుణగణాలన్నీ వున్నా, చొరవ కూడా వున్నవాణ్ణి పెళ్ళాడితే మంచిదని మహర్షి సూచన !!

## —— ఎలాంటి పెళ్ళిళ్ళు విజయవంతం అవుతాయి ? ——

పెళ్ళికి తలపడబోయే యువతీయువకులు ఎలాంటి వాళ్ళుగా వుంటే మంచిదో వాత్స్యాయన మహర్షి వివరిస్తున్నాడు.

1) **సవర్ణాయ :** ఒకే కులానికి చెందిన వారైతే ఆహారపు అలవాట్లు, జీవన విధానం, కులాచారాలు, మతాచారాలు, పూజావిధానాలు అన్నీ ఒకేలా వుంటాయి కాబట్టి ఎలాంటి ఇబ్బందులూ కలుగకుండా వుంటాయి.

2) **అనన్య పూర్వాయాం :** ఇంతకు మునుపు ఏ వ్యక్తితోనూ శారీరకంగా గాని, మానసికంగా గాని ఎలాంటి లైంగిక సంబంధాలు లేనివారై వుండాలి.

3) **శాస్త్రతో అధిగతాయాం** : శాస్త్రోక్తంగా కుటుంబ పెద్దల సమక్షంలో అందరి ఆమోదంతో పెళ్ళి జరగాలి. అది కళ్యాణమయంగా వుంటుంది!

4) **ధర్మాఉర్థః** : పెద్దల ఆమోదంతో పెళ్లి జరిగితే అది ధర్మబద్ధంగా వుంటుంది. అందువలన అందరి సహకారమూ లభిస్తుంది. తనకు ఎవరూ అక్కరలేదనుకునే వాళ్ళు స్వతంత్రంగా రిస్క్ తీసుకొని పెళ్ళిళ్ళకు తలపడతారు. అందరూ కావాలని, అందరి ఆమోదంతోనే ఇదంతా జరగాలనీ కోరుకునే వారు ప్రశాంత జీవనాన్ని పొందగలుగుతారు.

5) **పుత్రాః** : అలాంటి పెద్దల ఆమోదం వలన పుట్టే సంతానం విషయంలోకూడా ఎలాంటి ఇబ్బందులూ కలగకుంటాయి. కుల మతాలకు అధిక ప్రాధాన్యత ఇస్తున్న ఈనాటి సామాజిక వ్యవస్థలో పుట్టబోయే పిల్లల భవిష్యత్ గురించి కూడా ఆలోచించిన తర్వాతనే పెద్దల్ని ఎదిరించే నిర్ణయాన్ని చెయ్యగలగాలి!

6) **సంబంధః** : ఇలాంటి వాళ్ళకి సమాజంతో సత్సంబంధాలు నెలకొంటాయి.

7) **పక్ష వృద్ధి** : ఇలా దంపతులైన వారివలన వంశవృద్ధి కలుగుతుంది.

8) **అనుపస్కృతా రతిశ్చ** : ఇలాంటి ఆమోదయోగ్యులైన దంపతుల మధ్య జరిగే రతిని "కల్మషంలేని రతి"గా చెప్తాడు వాత్స్యాయనుడు.

ఇలా అనంగానే పూర్తిగా వాత్స్యాయనుడి భావాల్ని అర్థం చేసుకోకుండా ఆయన్నొక ఛాందసవాదిగా, ప్రేమ వివాహాలకు వ్యతిరేకిగా ముద్రవేయకండి. ఆయన చాలా స్పష్టంగా కొన్ని విషయాలు వేల సంవత్సరాలనాడే పేర్కొన్నాడు.....

1) మనుషులు ప్రేమించిన వివాహాలే చేసుకొని తీరాలని ఆయన ఎక్కడా నిర్దేశించలేదు.
2) ప్రేమను నివారించలేనంత బంధం స్త్రీ పురుషులిద్దరి మధ్య ఏర్పడితే, ఆ ఇద్దరినీ పెళ్ళి చేసుకోవద్దని కూడా వాత్స్యాయనుడు వారించలేదు.
3) పెద్దలు కుదిర్చిన వివాహంలో కన్నా, స్వయంగా ఎంచుకొని, అందరిని ఎదిరించి చేసుకున్న వివాహాల్లో "రిస్క్" ఎలా వుంటుందో సూచించాడు.
4) అలా రిస్క్ తీసుకోవడానికి సిద్ధపడ్డవాళ్ళే ప్రేమవివాహాలు చేసుకోవాలి గానీ, అనాలోచితంగా నిర్ణయాలు తీసుకొని, ఆ తర్వాత "పశ్చాత్తాపాలు", "విచారించడాలు" చేయవద్దంటాడు. ముందుగానే ఇందువలన కలిగే అనర్థాలను అంచనా వేసుకొని వాటిని ఎలా ఎదుర్కోవాలో స్పష్టంగా నిర్ణయించుకున్నాకే తల్లిదండ్రుల్నీ పెద్దల్నీ ఎదిరించడానికి సాహసించమంటాడు.

5) ప్రేమ వివాహం అయినంత మాత్రాన పెద్దలు గుడ్డిగా వ్యతిరేకించవలసిన అవసరం లేదు. ఇరుపక్షాల పెద్దల్ని అంగీకరింపచేసుకొని కోరుకున్న వ్యక్తిని పెళ్ళాడగలగడంలో వున్న నేర్పు, చాకచక్యం గుడ్డిగా ఎదిరించే వారిలో వుండదు!

## —— పరాయి మగాడితో సంబంధాలు ——

స్త్రీ గానీ, పురుషుడు గానీ పరాయి వ్యక్తులతో సంబంధాలు ఏర్పరచుకోవడానికి అన్ని సందర్భాల్లోనూ ఇంట్లో సుఖం తక్కువగా వుండడమే కారణం కావాలని లేదు. ఎవరైనా ఎవరితోనైనా లైంగిక సంబంధం కలుపుకొన్నారంటే, ఆ పరిస్థితులు, అందుకు అనుకూలతలూ, ఆ యిద్దరి మానసిక స్థితి, వాళ్ళ స్వభావం..... ఇలాంటి కారణాలెన్నో కన్పిస్తాయి.

స్త్రీ పురుషులు - ఇది ధర్మం, అధర్మం అని ఆలోచించకుండా, అజ్ఞాన స్వభావం చేత ఒంటరిగా పొందతగిన వ్యక్తి తారసపడ్డప్పుడు సంగమింపగోరతారు. ఇది మానవ సహజ లక్షణం. ఎవరు ఎవరితో ఎంత తిరిగారో తెలియజెప్పే స్పీడోమీటర్లుండవు. ఎవరికి వారికి వారి అంతరాత్మే సాక్షి! ఇందుకు ఆడవారు మినహాయింపేమీ కాదు. అక్రమ సంబంధాలు మగాళ్ళు మాత్రమే పెట్టుకొంటారనడం తప్పు. ఆ అక్రమ సంబంధాలు పెట్టుకొనేది స్త్రీలతోనే కదా..... కాబట్టి ఇద్దరూ సమాన బాధ్యులే!

స్త్రీల విషయంగురించి వాత్స్యాయన మహర్షి ముందుగా కొన్ని వివరాలు చెప్తున్నాడు -

వంటరిగా, అన్ని విధాలా అనుకూలంగా వున్న సందర్భాల్లో మనసుకు నచ్చిన వ్యక్తి తారసపడ్డప్పుడు సంగమించాలనే కోరిక స్త్రీలకూ కలగవచ్చు. కానీ, ఆ మగవాడి మానసిక స్థితి తెలుసుకోకుండా తొందరపడితే తనమీద నిందపడ్తుంది కాబట్టి సాధారణంగా ఆమె బైటకు తన కోర్కెని వ్యక్తం కానివ్వకపోవచ్చు. ఇలాంటి స్థితి నిజానికి మానసిక దోషమే! కానీ, "శీలం" అనే భావన స్త్రీని బాగా కట్టిపడేస్తుంది మన దేశంలో! ఈ భావనే లేకపోతే ఈ దేశంలో వివాహ వ్యవస్థ ఎప్పుడో కుప్పకూలి వుండేది. పైకి కనిపించని "దోషంగల శీలం"గా ఈ స్థితిని చెప్తాడు మహర్షి.

అందుకనే ఆ పురుషుడితో సంగమించాలనే కోరిక ఎంత బలంగా వున్నా, అతను అందుకు ఎంత ప్రేరేపించినా ఒక్కోసారి ఆమె విముఖురాలు అవుతుంది! అలాంటప్పుడు కొత్తపెళ్ళికొడుకు కొత్త పెళ్ళికూతుర్ని స్వాధీనం చేసుకోవడానికి చేసే ప్రయత్నాలన్నీ చేస్తూ ఆమెను ప్రేరేపించి, నమ్మించి, ఒప్పించగలగాలి. అప్పుడు గానీ, ఆమె "స్వాధీనం" కాకపోవచ్చు.

ఇటువంటి భావనే పురుషులకూ వుంటుంది. వనిత తనంత తావలచివచ్చిన అవకాశాలుకూడా అనేకసార్లు అతనికి కలగవచ్చు. కానీ, ధర్మానికీ, పెద్దల ఆచారానికి, ఒక్కోసారి ఎయిడ్స్ వంటి వ్యాధులకు భయపడి కూడా పురుషుడు ఆ పరాయి స్త్రీతో సంగమించదానికి ఇష్టపడకపోవచ్చు.

ఒక్కో మగాడు తన ఇంట్లో సుఖం తగినంత దొరక్కపోతే కదా బైట స్త్రీతో ఈ సంబంధం పెట్టుకోవాలి..... అనుకొని ఆ పరాయి స్త్రీతో సంబంధాన్ని తిరస్కరించవచ్చు.

మగాడిలో వరూధిని అన్నట్లు సులభంగా తనంతతాను సిద్ధం అయిన స్త్రీని నిర్లక్ష్యం చెయ్యడం, తేలికగా లభ్యం కాని స్త్రీ కోసం వెంపర్లాడడం అనే లక్షణాలు సహజంగా వుంటాయి. అందుకు అనుగుణంగా స్త్రీ ప్రవర్తించ వలసి వుంటుంది.

స్త్రీలు పరాయి మగాడితో సంబంధాన్ని పెట్టుకోకుండా నీతిగా వుండటానికి అనేక కారణాలు చెప్పాడు మహర్షి.

1) వ్యభిచార మనస్తత్వం లేకపోవడం.
2) తన భర్తమీద గాఢమైన అనురాగం, నమ్మకం.
3) తన పిల్లలు పవిత్రంగా వుండాలనే భావన.
4) తన శీలం మీద ఎలాంటి మచ్చ పడకూడదనే గట్టి నిర్ణయం.
5) ఇంతకాలం సుఖాన్ని బాగానే పొందాను... ఇప్పుడెందుకీ తుచ్ఛ వ్యవహారాలనే విరక్తి.
6) తను నమ్మిన వారంతా వదిలిపోయారనే దుఃఖం.
7) మగవాళ్ళ మీద సహజంగా వుండే ఏహ్యభావం, మగాళ్ళంతా దుర్మార్గులేననే పురుష ద్వేషం.
8) తన భర్తతో ఏనాడూ ఎడబాటు లేకుండా కలిసి జీవించడం.
9) తన వంటి నిజాయితీ పరురాల్ని ఇంత హీనంగా కోరుకొంటాడా..... అనే కోపం.
10) ఇలాంటి వాడితో సంబంధం ఎప్పటికైనా ప్రమాదం అనే భయం.
11) పెద్దగా ఆ పరాయి మగాడిమీద మోజు కలగకపోవడం.
12) వీడు తన రహస్యాన్ని దాచిపెట్టలేడనే అనుమానం. ఊరంతా ఫలానా ఆవిడతో కలిశానని టాంటాం చేస్తాడేమోననే భయం.
13) ఇవ్వాళ వుండి రేపు వెళ్ళిపోయేవాడితో సంబంధం వలన ఉపయోగం లేదనే భావన.
14) స్నేహితుల ప్రేరణ వలన వచ్చినవాణ్ణి ఎట్టి పరిస్థితుల్లోనూ దగ్గరకు రానివ్వకూడదు.

15) అతను హింసా స్వభావం కల్గిన వ్యక్తి కావడం.

16) అతను తిరుగుబోతు కావడం.

17) తనకన్నా ఎక్కువ సమర్థుడు, తాను అతన్ని తగినంతగా సంతోషపెట్టలేకపోవచ్చు - అంతటి సమర్థుడి జోలికి దేనికీ - అనుకోవడం.

18) ఊళ్ళో పెద్దమనిషి - నలుగురిలో "పెద్ద"గా తిరిగేవాడు. ఈ రెండు నిమిషాల భాగ్యానికి అతని చరిత్రకు మచ్చతేవడం దేనికనుకోవడం.

19) శత్రు రూపంలోని వాణ్ణి నమ్మి దగ్గరకు తీయకూడదనే భావన.

20) తనకు తగిన జోడీకాదని ఈసడింపు.

21) తాగి పడుకోవడమే తప్ప చేసేదేమీ వుండదని అతనిపైన చులకన భావం.

22) సమీప బంధువు కావడం.

23) బైటపడితే జీవితమే నరకం అవుతుందనే భయం.

24) తన శీలాన్ని పరీక్షించుకోవడం కోసం భర్తే ఇతన్ని ఈ విధంగా పంపివుండవచ్చనే అనుమానం.

25) పవిత్రమైన తన చరిత్రని ఈ తుచ్ఛుడికోసం భస్మం చేసుకోవడం దేనికీ..... అనే ధర్మబుద్ధి.

ఇలాంటి అనేక కారణాలు స్త్రీలను పతివ్రతలుగా నిలుపుతున్నాయి.

## —— స్త్రీ జనాదరణ పొందగలిగే మగాళ్ళు ——

పరాయి ఆడదానితో సంబంధాలు పెట్టుకోగలగాలంటే, ఇప్పుడు చెప్పిన ఈ పాతిక కారణాల్నీ, ఇంకా ఇలాంటి అనేక కారణాల్ని ముందుగా ఊహించి, వాటిని తొలగించి, ఆమెను నమ్మించి వశం చేసుకోగలవాళ్ళు ఎక్కువమంది ఆడవాళ్ళ ప్రేమానురాగాల్ని పొందగలుగుతారు.

కామశాస్త్ర రహస్యం బాగా ఎరిగినవాడు ఎలాంటి స్త్రీనైనా వశం చేసుకోగలుగు తాడు. ఎక్కువగా కథలు, జోకులూ హాస్య ప్రసంగాలు చెయ్యగలవాడు ఆడవాళ్ళని తేలికగా నమ్మించి బురిడీ కొట్టించ గల్గుతాడు. తరచూ ఆ యింటికి రాకపోకలు జరపగలిగే వాడికి ఈ అవకాశం ఎక్కువగా వుంటుంది.

ఆ స్త్రీ చెప్పే పనులు చేసిపెడుతూ అవసరానికి సాయపడేలా ప్రవర్తించేవాడికి ఎప్పుడైనా ఆ స్త్రీ వశం అయ్యే అవకాశం వుంది.

ఔచిత్యం గమనించి మాట్లాడేవాణ్ణి స్త్రీ త్వరగా నమ్ముతుంది. ఆమె ఇష్టాలు తెలుసుకొని తదనుగుణంగా నడుచుకునేవాణ్ణి త్వరగా స్త్రీ ఇష్టపడ్తుంది. తనకిష్టమైన

వస్తువుని, చాలా కాలంగా కావాలనుకుంటున్నదాన్ని అతను ఆమెకు సమకూర్చిపెట్టినప్పుడు ఆమె సహజంగానే మనసులోనైనా ఇష్టపడే అవకాశం వుంది.

అందగాడికి పరాయి స్త్రీలతో పొందు అవకాశాలు ఎక్కువగా వుంటాయి. ఎక్కువమంది తేలికగా దొరుకుతారు.

పౌరుషవంతులు, రచయితలు, కళాకారులకు స్త్రీలు త్వరగా వశం అవుతారు.

చేతి సాయంగా వున్నంత మాత్రాన ఒక ఆడది ఆ మగవాణ్ణి అనుమతిస్తుందనుకో నవసరం లేదు. "వాడు చెంచాగాడు" అనుకొంటే మాత్రం అలాంటి చెంచాగిరీ చేసే బానిస మనస్తత్వం వున్నవాణ్ణి ఎలాంటి స్త్రీ అయినా, మూటలు మోసేవాడిగానే చూస్తుంది గానీ, తన పక్కన చోటివ్వలేదు.

## —— సులభంగా దొరికే స్త్రీలు ——

ఒక ఆడదాని మనసుని దోచుకోవడం అంత తేలికైన విషయం ఏమీ కాదని, అందుకు ఆ మగాడు అనేక అర్హతలు సాధించుకోవాల్సి వుంటుందనీ ఈ వివరణల్ని బట్టి మనకు అర్థం అవుతుంది.

కొంగు తగిల్తే చాలు పొంగిపోయే బలహీనమైన మానసిక ప్రవృత్తులున్న మగాళ్ళు వున్నట్లే, బలహీనమైన మనోవృత్తులు కల్గిన స్త్రీలుకూడా వుంటారు. వాళ్ళు చిన్న సైగకే సిద్ధంగా వున్నట్లు ప్రవర్తిస్తుంటారు. వాళ్ళ గురించి హెచ్చరిస్తున్నాడు మహర్షి!

బజార్లో వచ్చిపోయే మగాళ్ళని వీధి గుమ్మంలో నిలబడి ఆబగా చూసే ఆడవాళ్ళు సభ్య సమాజం దృష్టిలో "బలహీనమైన ప్రవృత్తులుగల స్త్రీలు"గా ముద్రవేయబడతారు.

మేడమీద నిలబడి చుట్టుపక్కల ఇళ్ళలో మగాళ్ళ వంక చూస్తూ కాలక్షేపం చేసేవాళ్ళు, యువకులు, నూనూగుమీసాల కుర్రాళ్ళు వున్నచోట చేరి వాళ్ళతో మాటలు కలుపుతూ వుండే కొందరు ఆంటీల మనసుల్లో ఇలాంటి ప్రవృత్తులు రగులుతూ వుంటాయి. చూసేవాళ్ళకి ఆ పెద్దావిడ పిల్లలతో ఏదో మాట్లాడుతున్నట్టే వుంటుంది గాని, మనసులో ఉత్తేజం కోసమే ఈ పనిచేస్తున్నట్టు కన్పించదు. ఇరుగుపొరుగు ఇళ్ళకు తిరుగుతూ ఉబుసుపోని కబుర్లాడుతూ ఆ ఇంటి మగాళ్ళ వివరాలు ప్రశ్నించే ఆడవాళ్ళు కూడా ఇలాంటి కోవకే చెందుతారు.

రోడ్డుమీద పోతూ, తననెవరైనా గమనిస్తున్నారా లేదా అని దిక్కులు చూస్తూ వెనక్కి పక్కలకూ తిరుగుతూ నడుస్తుండే ఆడవాళ్ళు కామంతో లోలోపల రగిలిపోతూ వుండేవారు కావచ్చు.

అసమర్థుడైన భర్తతో కాపురం చేస్తున్న స్త్రీ, భర్తని ద్వేషించే స్త్రీ, అంటూ, సొంటూ ఇలాంటి పట్టింపు లేవీ లేని స్త్రీ, భర్త బీజదోషం వలన తనకు సంతానం లేని స్త్రీ, పుట్టింట్లోనే ఎప్పుడూ ఉంటూవుండే స్త్రీ..... వీళ్ళు సాధారణంగా "సులభ సాధ్యు"లుగా వుంటారు.

బాల్యంలోనే భర్తను కోల్పోయిన విధవరాలు, పేదరికంలో వున్నదీ, ఉన్నవాటికన్నా ఎక్కువ భోగాలు కావాలని కోరుకునే స్త్రీ, అసంతృప్తితో రగిలిపోతున్నదీ, తేలికగా లభ్యం అయ్యే అవకాశం వుంది!

భర్తలు కొందరు అకారణంగా అనుమానించి భార్యల్ని అవమానిస్తుంటారు. అలా అనుమానితు లైన స్త్రీలు కసికొద్దీ ఆ అనుమానాన్ని నిజం చెయ్యాలని అనుకోవచ్చు. అలాంటి స్త్రీలు కూడా సులభంగా లభ్యం కావచ్చు.

నపుంసకుడు, బద్ధకస్తుడు, కురూపి, అసమర్థుడు, అమాయకుడు, వృద్ధుడు, రోగిష్టిమారి వాడు..... ఇలాంటి వాళ్ళ భార్యలు పర పురుషులకు అన్ని అవకాశాలూ సమకూరినప్పుడు తేలికగా దొరికే అవకాశం వుంటుంది.

తగిన వ్యక్తి అనిపించినవాడు ఎదురయినప్పుడు కామం ఎవరికైనా కలుగుతుంది. అది పరిచయం వలన, సాన్నిహిత్యం వలన వృద్ధి పొందుతుంది. మొదట్లో ఇలాంటి ఆలోచన తప్పని అనిపించినా పోనుపోనూ అది బలమైన కోరికగా రగులుకోవడం ప్రారంభిస్తుంది. ఇదంతా అన్ని సందర్భాల్లోనూ ఒకేసారి ఏదో అకస్మాత్తుగా ఒక బలహీన క్షణంలో జరిగిపోతుందనుకోవడం వాస్తవం కాదు. ఆ "బలహీన క్షణం" ఏర్పడటానికి వెనక కొంత కథ జరగాలి కదా!! ఆ స్త్రీ తన బుద్ధిబలంచేత శోధించినతర్వాత "బలహీన క్షణం" ఏర్పడేందుకు అవకాశం ఇస్తుందనేది వాత్స్యాయనుడు చెప్పిన అంశం. "బుధ్యా సంశోధితోద్వేగా స్థిరా స్యాదన పాయినీ" అన్నాడు. అంటే, తెలివితేటలతో శోధించిన తర్వాత అపాయం లేదనే అవకాశాలు కలిగిన తర్వాతే "సిద్ధి"ని స్థిరంగా కల్పిస్తుందీ అని! అంటే, తన అంగీకారం తెలుపుతుందని !

కాబట్టి మగవాడు తన రతిసమర్థతను చూసుకొని, ఆమె అనుకూల లక్షణాలను గమనించుకొని, ఆమె ఏ మగాణ్ణయినా తననుంచి విరక్తిని పొంది "వద్దు" అనే ప్రమాదం లేకుండా జాగ్రత్తగా మెలగుతూ ప్రవర్తిస్తే ఆ స్త్రీ అతనికి లభ్యం అవుతుంది.

ఒకసారి వద్దు అంటూ వెళ్ళిపోయిన తర్వాత తిరిగి ఆమెను పొందడం కష్టం కావచ్చు. కాబట్టి, అందాకా రాకుండానే అవుననిపించి మెప్పించగలగడం మగవాడి చాకచక్యం మీద ఆధారపడి వుంటుంది!!

## —— స్త్రీల మనసెరిగి నడుచుకోవాలి..... ఇలా! ——

పురుషుడు ఎన్నోరకాలుగా ప్రయత్నిస్తుంటాడు. ఎక్కడెక్కడికో చేతులు పోనిచ్చి ఏవేవో తడుముతుంటాడు. అయినా కొందరు స్త్రీలు తొణకరు. ఏమాత్రం ప్రతిస్పందించరు.

అంతమాత్రాన ఆమెకు స్త్రీ సహజమైన స్పందన లేదనో, ఆమెకు ఈ పనులంటే ఇష్టంలేదనో, ఆమెకు తనమీద విశ్వాసం కలగలేదనో అనుకొంటే తొందరబాటే అవుతుంది. అలాగని తొందరపడి ఏదో చేసెయ్యాలనుకోవడం కూడా పొరబాటే అవుతుంది.

తాను సంగమిస్తున్న స్త్రీ మానసిక ప్రవృత్తి ఎలాంటిదో పరీక్షించి సరిగ్గా అంచనా వేయగలగాలి. కొందరు ఆడవాళ్ళు పురుషుడు చేసే చేష్టలన్నింటినీ సహిస్తారు. చెయ్యనిస్తారు. కానీ ఏమీ ప్రతిస్పందించరు. అనుకూలత చూపించరు. అన్నీ దూరంగా నిలబడి పైపైన చేయడమే నన్నట్లుంటారు. నడుం నుంచి పై భాగం వరకే..... అన్నట్లు ప్రవర్తిస్తారు. ఇలాంటి వాళ్ళ పట్ల చాలా సహనం వహించాలి.

ఇంక లాభంలేదని ఆమెను వదిలేసి దూరంగా వచ్చేశాడనుకోండి..... అలాంటప్పుడు ఒక్కోస్త్రీ స్వాధీనం అయ్యే అవకాశం వుంది. ఎలాగంటే, మనుషులకు సహజమైన చంచలత్వం వుంటుంది కదా..... అందువలన పరిచయం దూరం అయ్యేకొద్దీ మళ్ళీ పరిచయం పెంచుకోవడం కోసం వాళ్ళే ప్రయత్నిస్తుంటారు. "ఎక్కడా కన్పించడంలేదే ఈ మధ్య" అని పలకరిస్తారు. ఈ పలకరింపులో చుట్టూ వినేవారికి ఏ అర్థమూ కన్పించకపోయినా అతనికి మాత్రం ఒక సందేశం వెడ్తుంది..... ఈ సారి స్వాధీనం అవుతానని!

ఒక్కో స్త్రీ కౌగిలింతకు ఒప్పుకొంటుంది. ముద్దూ మురిపాలన్నింటికీ ఒప్పుకొంటుంది. కానీ, భగ లింగ సంయోగానికి మాత్రం ఒప్పుకోదు. అలాగని అతని మీద నమ్మకం, ప్రేమ లేవనికాదు. ఏకాంతంలో కలుసుకొంటుంది. అన్నిరకాలుగానూ అతన్ని రెచ్చగొట్టి తాను రెచ్చిపోతుంది. సంభోగం పట్ల ఆమెకు కొన్ని అనుమానాలుండి ఉండవచ్చు. వాటివలన ఆమె సంభోగాన్ని తప్ప తక్కిన వాటినన్నింటినీ కోరుకొంటోందన్నమాట. ఆమె అనుమానాలు, భయాల్ని అతను పోగొట్టి స్వాధీనం చేసుకోగలగాలి. మనసెరిగి ప్రవర్తించడం అంటే అది!

అన్నింటినీ అంగీకరించి తీరా చివరికి సంభోగం దాకా వచ్చేసరికి ఒక్కసారి కోపంగానూ, కఠినంగానూ ప్రవర్తిస్తారు. అలాంటప్పుడు మగవాడు కూడా కోపాన్ని ప్రదర్శించకుండా సహనం పట్టి అనునయించడం, ఆమె ప్రేమను తిరిగి పొందేందుకు ప్రయత్నించడం చేసి అప్పుడు వశం చేసుకోగలగాలి.

కొంతమంది స్త్రీలు ఒక్కోసారి ఎంతో దగ్గరగానూ, ఒక్కోసారి ఎంతో దూరంగానూ ప్రవర్తిస్తారు. ఒక్కోసారి అతనెవరో తెలియదన్నట్టే వుంటారు. ఒక్కోసారి అతను కన్పించకపోతే వుండలేనంతగా ప్రవర్తిస్తారు. వాళ్ళ మనసు ఊగిసలాటలో వుందనీ, మనసులో కోరికని బలంగా అణచిపెట్టుకోవడానికే ఇలా ప్రవర్తిస్తూంటారనీ అర్థంచేసుకోవాలి. ఆమె "దూరం"గా ప్రవర్తించినా విడవకుండా ఏదో వంకతో ఆమెను పలకరిస్తూ సాధ్యమైనంత దగ్గరగా వుండేందుకు ప్రయత్నించాలి. ఏదో ఒక రోజుకు ఆమె మనస్ఫూర్తిగా అతనికి వశం అయి తీరుతుంది!

అతనికోసం ఆమె ప్రయత్నించినప్పుడు ఆమె మొదటి సైగకే అతని స్వాధీనం అవుతుంది. ఆమెకోసం అతను ప్రయత్నించినప్పుడు ఆమె మానసికంగా పూర్తిగా సిద్ధపడే వరకూ సహనం వహిస్తుంది. ఈ సహనాన్ని ఆమెను కోరుతున్న మగవాడు అంచనా వేయగలగాలి. అందుకనుగుణంగా ప్రవర్తించాలి. స్త్రీల మనసెరిగి ప్రవర్తించడం అంటే ఇది!

## —— ఒక్కడే భర్త - ఒక్కతే భార్య ——

భార్యాభర్తలు ఒకరికొకరు ఎలా ప్రవర్తించాలి... ?

స్త్రీ పురుషుడి పట్ల వ్యవహరించవలసిన తీరు - పురుషుడు స్త్రీ పట్ల వ్యవహరించవలసిన తీరు... ఇవి నిశితంగా చర్చించవలసిన విషయాలే.

వాత్స్యాయనుడు ఈ విషయాల్ని సీరియస్‌గానే ప్రస్తావించాడు.

పెళ్ళయిన ఆడవాళ్ళు రెండురకాలుగా వుంటారు. 1) ఏకచారిణి : మనసా, వాచా, కర్మణా ఒక్కరినే భర్తగా భావించుకొని అతనితోటే జీవితం అనుకొని భర్తతో కలిసి జీవించే స్త్రీ ఏకచారిణి. 2) ఏక పత్నిక : తన భర్తకు తానొక్కతే భార్య అయివుండి సవితిపోరు లేకుండా అనురాగంతో భర్తతో కలిసి జీవించే స్త్రీ.

బహుచారిణులు, సపత్నికలూ వీరికి వ్యతిరేకంగా మసలుకొంటూ వుంటారు. అనేక మంది పురుషులతో సంబంధాలున్న స్త్రీ గురించి అలా వుంచితే, అనేక మంది స్త్రీలతో సంబంధం వున్న పురుషుడి భార్య ఎలా ప్రవర్తించాలో కూడా వాత్సాయనుడు ప్రస్తావించాడు.

19వ శతాబ్దం వరకూ కొద్దిపాటి స్థితిమంతులైన పురుషులు అనేక పెళ్ళిళ్ళు చేసుకోవడం మనవాళ్ళకు అలవాటుగా వున్న విషయమే ! బహుభార్యాత్వాన్ని హిందూ చట్టాలు వ్యతిరేకిస్తున్నా, ఇప్పటికీ చిన్నిల్లు, పెద్దిల్లు సాంప్రదాయాలు చాలా మంది విషయంలో మనం గమనిస్తూనే వున్నాం.

అలాంటి పురుషుడికి దురదృష్టవశాత్తూ భార్యగా వున్న స్త్రీ ఏం చెయ్యాలి ? ఆ భర్త ఎలాంటి దౌర్భాగ్యుడైనా అతన్నే దేవుడిలాగా గౌరవిస్తూ, అతని మనసుకు నచ్చిన రీతిగా అతన్ని అనుసరిస్తూ వుండాలా ?

"భార్యా ఏకచారిణీ గూఢ విస్రంభాదేవ వత్పతి మానుకూల్యేన వర్తేత !" అని వాత్స్యాయనుడు పేర్కొన్న సూత్రానికి అర్థం భర్తపైన నిర్మలమైన ప్రేమ గల్గిన స్త్రీ అతనికి అనుకూలమైన రీతిలో వర్తిస్తుందనీ, అతనిమీద ఆమెది "గూఢ విస్రంభం" అంటే రహస్య ప్రేమగా వుంటుందని అన్నాడు. అదే విషయం ఏకచారుడైన భర్తకీ వర్తిస్తుంది. నీతి నియమాలు, కట్టుబాట్లు స్త్రీలకు మాత్రమే వుంటాయని అర్థం కాదు. అనేకమంది స్త్రీలతో సంబంధాలున్న భర్త పట్ల ఇలాంటి నిగూఢ ప్రేమ స్త్రీకి వుండాల్సిన అవసరం లేదు. వుండదు కూడా !

స్త్రీ పురుషులిద్దరూ ఒకరిపట్ల ఒకరు ప్రేమను పరస్పరం పెంపొందించుకునేలా ప్రవర్తించాలనేదే వాత్సాయనుడు చెప్పిన దాని సారాంశం !

నీతి, నిజాయితీ అనేవి స్త్రీ పురుషులిద్దరికీ సమానంగా వుండాలి !

## —— స్త్రీ మరొక పురుషుణ్ణి ఎందుకు కోరుతుంది ? ——

లేచిపోయింది, వాడితో వెళ్ళింది, వాడితో పడుకుంది, కొంగు పరిచింది – ఇలాంటి అసభ్యకరమైన పదజాలంతో స్వేచ్ఛగా ప్రవర్తించిన కొందరు స్త్రీలగురించి నీచంగా మాట్లాడుకొంటూ వుంటాం.

అనేక మంది స్త్రీలతో సంబంధాలున్నవాణ్ణి "రసికుడు" అని గౌరవిస్తాం. కానీ, అలాంటి స్త్రీని జార, వేశ్య, సాని, తిరుగుబోతు అంటాం. మన వ్యవస్థలో మొదటినుంచి ఈ విధమైన విరుద్ధ భావన వుంది.

ఒక ఆడది మరో పురుషుణ్ణి ఎందుకు కోరుతుంది ?

1) భర్త చనిపోయిన తర్వాత, జీవితాన్ని సరిదిద్దుకోవడం కోసం స్త్రీ మరో పురుషుణ్ణి కోరుతుంది. భార్య చనిపోయిన భర్తకూడా ఈ కారణంచేతే మరో పెళ్ళికి తలపడ్తున్నాడు. పునర్వివాహం చేసుకున్న ప్రతి సందర్భంలోనూ కామోద్రేకం ఒక్కటే కారణం అనుకోవడం అన్యాయం.

2) భర్త దుర్మార్గుడైనప్పుడు, అతనితో కలిసి జీవించడం కష్టం అని నిర్ధారణకు వచ్చినప్పుడు ఆడది అతన్నించి విడిపోయి, మరో పురుషుణ్ణి కోరవచ్చు.

3) "గుణేషు సోపభోగేషు సుఖ సాకల్యం తస్మాత్తతో విశేష ఇతి... గోనర్దీయః"

మగాడు ఎలాంటివాడైతే ఏమిటీ... వాడితో సంగమిస్తే ఆ ఆడదానికి సుఖం కలుగుతుంది కదా... అనుకోవడం పొరబాటు. మగవాడు తన ప్రేమాభిమానాలకొద్దీ, తన మనసుకొద్దీ, తన ఆత్మీయతకొద్దీ ఆమెకు సుఖాన్ని అందించగలుగుతాడు. అలాగే ఆమెనుంచి సుఖాన్ని పొందగలుగుతాడు. అందువలన గుణాలు లేని మగాడికంటే గుణవంతుడైన మగాడు ఇచ్చే సుఖంలో ఆనందాన్ని, తృప్తినీ ఎక్కువగా పొందుతుంది స్త్రీ. అది ఆమెకు కరువైనప్పుడు, ఆమె మనసు మరొకరిని కోరినా కోరవచ్చు. అంతమాత్రాన అది వ్యభిచారం అనవలసిన అవసరం లేదు. పదే పదే అదే రంధిగా పర పురుషులను కోరుతుండే స్త్రీ మాత్రమే వేశ్యలలో చేరుతుంది అంటాడు గోనర్దీయుడనే ముని !

ఇక్కడ విషయం తనను సంగమించే పురుషుడు గుణవంతుడా... రూపవంతుడా అనికూడా కాదు- తన మనసుకు అనుకూలంగా వున్నప్పుడు అతన్ని ఎక్కువగా పొందుతుంది స్త్రీ. తన స్త్రీ అలా తనకు అనుకూలపడేలా మెలగవలసిన బాధ్యత పురుషుడిదే!

అంతేగాని, నేను తాళికట్టాను కాబట్టి, అది చచ్చినట్టు నా చెప్పుకింద తేలులా పడి వుండాల్సిందే నన్నట్లుగా వ్యవహరిస్తే ఆ ఆడది తన మనసుకు అనుకూలతకోసం మరో పురుషుడి సంగమాన్ని కోరుకోవడం సహజంగానే జరగవచ్చు. దీనికి మనం ఆమెను తప్పుపట్టాలా... ఆమె భర్తని తప్పుపట్టాలా... ఆమెకు అనుకూలత కలిగించిన ఆ పరపురుషుణ్ణి తప్పుపట్టాలా...?

**మొగుణ్ణి వదిలేయదలిస్తే... ?**

రూపగుణ లావణ్యాలు మాత్రమే కాదు, స్త్రీ పురుషుల మధ్య సంసార బంధాన్ని ఏర్పరచేది "మనసుకు అనుకూలత" అని స్పష్టంగా చెప్పిన వాత్స్యాయనుడు, మనసుకు అనుకూలత లేనప్పుడు నిర్మొహమాటంగా ఆ భర్తని వదిలేయడం లేదా వదిలించుకోవడం అవసరమేనంటాడు.

"స్వేచ్ఛయా గృహాన్నిర్గచ్ఛంతీ"... అలా స్వేచ్ఛగా భర్తను వదిలి వెళ్ళిపోయే సమయాలలో స్త్రీ తీసుకోవలసిన కొన్ని జాగ్రత్తల్ని వివరించాడు వాత్స్యాయన మహర్షి.

1) అంతకు మునుపు తనమీద ఏదో ఒక ప్రేమ సన్నివేశంలో ఆ భర్త ఇచ్చిన బంగారపు నగలు, ఇతర వస్తు సరంజామా, డబ్బు, స్వేచ్ఛగా తనవెంటే తెచ్చేసుకోవచ్చు.
2) ఆ భర్తే 'ఇంట్లోంచి పో' అంటున్నప్పుడు ఏమీ వదలకుండా తనకు సంబంధించిన ప్రతిదీ వెంటపుచ్చుకు వచ్చేయవచ్చు.
3) మరో భర్తను చేపట్టిన తర్వాత ఆ యింట్లో తను పూర్తి స్వేచ్ఛగా వుండే పరిస్థితులు వున్నాయో లేవో ముందుగానే ఆలోచించుకోవాలి. పెనంమీంచి పొయ్యిమీద పడ్డట్లు ఏ అననుకూలతల కారణంగా ఆ భర్తని వదిలి తాను వచ్చేసిందో

ఆ అననుకూలతలు ఇక్కడా కొనసాగేట్లు వుంటే, భర్తను మార్చి చివరికి తాను సాధించిందేం వుంటుంది... ? ఇవన్నీ ముందే జాగ్రత్తగా ఆలోచించుకోవాలి. నిశితంగా పరిశీలించుకోవాలి. ఆవేశంతో నిర్ణయాలు తీసుకొంటే, పెద్ద ఎదురుదెబ్బ తగిలే ప్రమాదం వుంది.

4) కొత్త భర్తతోనూ, అతని స్నేహితులతోనూ, అతని పరివారంతోనూ నవ్వుతూ, స్నేహంగా, గౌరవపూర్వకంగా మసలుకోవాలి. అవతలి వాడెవ్వడూ వేలెత్తి చూపించేలా వుండకూడదు ఆమె నడవడిక. తన ప్రతిభ కనపరిచేలా వుండాలి.

5) కొత్త భర్తని అరవైనాలుగు కళలతోనూ రంజింపచెయ్యాలి. అతని కుటుంబానికి, పరివారానికి, ఆడపడుచులకు, అత్త మామలకు కానుకలు వగైరా ఇస్తూ ఉపకారాలు చేస్తూ వారి ప్రేమాభిమానాలు పొందాలి.

6) ఆ కొత్త భర్తకు సంతానం వుంటే, వాళ్ళపట్ల కన్న తల్లిలా ప్రవర్తించాలి.

7) లైంగికపరంగా సాధ్యమైనంతవరకూ భర్త ఎలా కోరితే అలా నడుచుకోవాలి. అతనికి కోరిక కలిగినప్పుడు తనకు కోరిక లేదని నిరాకరించడం, తనకు కలిగినప్పుడు అతను వెంటనే రాలేదని నిందించడం ఇలాంటివి చెయ్యకుండా వుంటే మంచిది.

8) మంకుతనం వలన, దుస్స్వభావం వలన లైంగిక వాంఛ మందగించి, సెక్సులో సుఖభావన తగినంత కలగకపోవడం, మరింతగా అతనికి సుఖాన్ని అందించాలనే ఆలోచన లేకపోవడం జరుగుతుంది. ఇవి రెండూ మనసు సౌమ్యంగానూ, శాంతంగానూ ప్రేమతో నిండి వున్నప్పుడు మాత్రమే కలుగుతాయి. సౌమ్యంగా వుండే స్త్రీలలో సుఖప్రాప్తి ఎక్కువ. సుఖాన్నందించడం కూడా ఎక్కువగా వుంటుందంటాడు వాత్స్యాయనుడు.

## —— వేశ్యలు ఇలా ప్రవర్తిస్తారు ! ——

ధర్మపత్నితోనో, ప్రియురాలితోనో సంగమించడానికి, ఒక వేశ్యతో సంగమించడానికీ చాలా తేడా వుంటుందంటాడు వాత్స్యాయన మహర్షి.

***"వేశ్యాణా పురుషాధిగమే రతిర్వృత్తిశ్చా వర్గాత్"*** అంటూ వేశ్యలకు సంబంధించిన ఒక ప్రకరణాన్ని "వైశికాధికరణం' పేరుతో ఆరవ అధ్యాయంగా తన కామ సూత్రాలలో ప్రకటించాడు.

స్త్రీ పురుషుల మధ్య సహజమైన రీతిలో జరిగే రతి కార్యక్రమంలో సుఖానుభవం అనేది సమానంగా వుంటుంది. కానీ, ఒక పురుషుడు ఒక వేశ్య – ఇద్దరి మధ్య జరిగే

లైంగిక కృత్యంలో వేశ్యకి అధికారం ఎక్కువగా వుంటుంది. వేశ్యలు పురుషుల్ని అధిగమిస్తారంటాడు.

మొదటి విషయం ఏమంటే, వేశ్యకు ఒక మగాడు దొరికితే వాడివలన ఆమెకు కొంత రతిసుఖంతోపాటు డబ్బుకూడా లభిస్తుంది. ఆ మగాడికి కామసుఖం ఒక్కటే లభిస్తుంది. డబ్బు వదుల్తుంది. వుంటే, ఏదైనా జబ్బు అదనంగా తగుల్తుంది... అంతే !

వేశ్యలలో కామాసక్తి, కామశక్తి ఎక్కువగా వుంటాయని చాలామంది మగవాళ్ళ నమ్మకం. అందుకని ఆమె ఏంచేసినా బావుంటుందని కావాలని పదేపదే వచ్చి అడిగి అలా చేయించుకొంటారు.

వేశ్య నిజంగానే ఆ మగాడి వలన సుఖానుభవం పొందుతోందా... ? ఆ విషయం గురించి ఆమెను కలిసిన మగాడు ఎన్నడూ ఆలోచించడు. ఎందుకంటే డబ్బిచ్చాడు కాబట్టి ఆమెకు అదే సంతోషం, సంతృప్తి.

అందుకని వేశ్య తనకు డబ్బు మీద ఆశ లేనట్లూ, అతనికి కావలసిన సుఖాన్ని అందించడమే ఆమె లక్ష్యం అయినట్లూ ప్రవర్తిస్తుంది. అందువలన అదనంగా మరికొంత గుంజడానికి అవకాశం కలుగుతుంది.

ఆమె బతకాలి - ఇప్పుడే కాదు, భవిష్యత్తులో ముసలితనం వచ్చిన తర్వాత కూడా బతకాలి. అందుకోసం ఆమె జననాంగాన్ని నమ్ముకొని, అమ్ముకొని బతుకుతోంది అంతే !

## —— పరాయి స్త్రీతో సంబంధం ——

వాత్స్యాయనుడు చెప్పిన జాగ్రత్తలు :

***"తేషు సాధ్యత్వ మన త్యాయం గమ్యత్వ మాయితిం వృత్తించాదిత ఏవ పరీక్షేత"***

పరాయి ఆడది... తెల్సిన ఆవిడే కావచ్చు- ఆమెతో సెక్సు సంబంధాలు పెట్టుకోబోయే ముందు నాలుగు ముఖ్య విషయాలు దృష్టిలో పెట్టుకొని ఆలోచించమన్నాడు-

1) ఈమెతో సంబంధాలు పెట్టుకోగలగడం సాధ్యమయ్యేదేనా... అనవసరంగా ప్రయత్నించి, వృధా శ్రమ మిగిలి, ఆ తర్వాత అల్లరయి, ఆ పైన ముఖం చూపించడానికి వీల్లేని సిగ్గుమాలిన పరిస్థితి రావచ్చేమో... జాగ్రత్తగా వుండండి ! ఎవరూ చూడకుండా చెంపదెబ్బ తిన్నా ఫర్వాలేదు. నలుగురిలో ఒక్క మాట అన్నారంటే ఇహ తలకాయి ఎత్తుకొని తిరగలేం కదా !

2) ఒకవేళ గట్టిగా ప్రయత్నించి, ఆమె అంగీకారాన్ని పొంది సుఖించినా, ఇది బయటపడకుండా రహస్యంగా వుండి, రేపు ఎలాంటి ప్రమాదమూ రాకుండా వుంటుందా...?

3) ఆమెకు ఎయిడ్స్ సుఖవ్యాధులూ ఇలాంటి దోషాలు, రోగాలు ఏమీ లేకుండా శారీరకంగానూ, మానసికంగానూ ఆరోగ్యవంతురాలేననే నమ్మకం వున్నదా !

4) ఈమెతో లైంగిక సంబంధాలు పెట్టుకుంటే, ఏమైనా లాభాలు కలుగుతాయా ? ఈ నాలుగు ప్రశ్నలకూ సరయిన సమాధానాలు దొరికితే, నమ్మకం కుదిరితే, ఆ స్త్రీతో సంగమించవచ్చునంటాడు మహర్షి.

పరాయి స్త్రీని సంగమిస్తున్నాసరే, ప్రేమాభిమానాలే అందుకు ప్రధాన కారణంగా వుండాలి. ప్రేమాభిమానాలు, ఆమెపట్ల రగులుకుపోయేంత కోరిక లేకుండా, కేవలం అరనిమిషం సుఖం కోసం అంత రిస్క్ తీసుకోవడం కేవలం వ్యభిచారమే అవుతుందంటాడు మహర్షి. ఒకరినొకరు మనసా, వాచా, కర్మణా ప్రేమతో ఇష్టపడినప్పుడు దానికి వ్యభిచారం అనీ, ఆమెని వేశ్య అనీ, అతణ్ణి విటుడు, జారుడు అనీ పిలవవలసినంత పనిలేదు.

ఎ) ఆమె రూపలావణ్యాలతోపాటు ఆమె స్వభావాన్ని బాగా పరిశీలించాలి.

బి) ఆమె భర్త తిరుగుబోతు, నీచ స్త్రీలతో తిరిగే అవకాశం వున్నవాడు అయినప్పుడు, ఆమె ఆరోగ్య పరిస్థితి, ముఖ్యంగా ఎయిడ్స్ వ్యాధుల విషయంలో ఆలోచించవలసి వుంటుంది.

సి) ఆమె మాటలు నిజాలా... అబద్ధాలా అని జాగ్రత్తగా విచారించాలి.

డి) ఆమె గత చరిత్ర ఎలాంటిదో, నడవడిక ఎలాంటిదో తెల్సుకోవాలి.

ఇ) లైంగికంగా ఆమె సుఖదాయకంగా వుంటుందో లేదో అర్థంచేసుకోవడానికి ప్రయత్నించాలి.

ఇలాంటి జాగ్రత్తలు ఏమీ తీసుకోకుండా, ఫలానా ఆఫీసర్‌గారి భార్య తేలికగానే పడిపోయిందని ఎగిరి సంతోషించకూడదు. ఎందుకంటే, కొంతమంది ఆఫీసర్లకు ఏ ఊళ్ళో ఉద్యోగం చేస్తుంటే ఆ ఊళ్ళో ఒక 'భార్య'గా వ్యవహరించబడేది వుంటూవుండే అవకాశం వుంది కాబట్టి !!

## అందాన్ని చూసి ఆనందించండి
## అనుభవించేందుకు తొందరపడకండి !

*"యం కంచి దుజ్వాలం పురుషం దృష్ట్వా స్త్రీ కామయతే"*

ఏ కాస్త అందగాడైన మగాడు కన్పించినా ఆడదాని మనసులో కామవాంఛ రగలవచ్చు.

"తథా పురుషోఽపియోషితం అపేక్షయాతుస ప్రవర్తతే... !!

అలాగే అందమైన స్త్రీని చూసినప్పుడు, కొందరు మగవాళ్ళ జననాంగాల్లోంచి స్రావంకూడా బైటకు వస్తుంది.

అందాన్ని చూసినప్పుడు స్త్రీ పురుషులిద్దరూ పరస్పరం ఒకరికొకరు లైంగికోత్తేజానికి లోనౌతారు.

అవునండి !

అంతమాత్రానికే ఏమయ్యింది ?

చూపులతోనే కడుపులూ రావు, వ్యాధులూ సోకవు కదా...

రేణుకాదేవి మనసులో గంధర్వుణ్ణి చూసి "ఆహా !" అనుకుందిట... అది జమదగ్నికి తెల్సిందట – కొడుకు పరశురాముణ్ణి పిలిచి తల్లి తలకాయ నరికేయమన్నాడట... ఎవడో తంపుల రాయుడు – ఈ కథలో బైటకు కన్పించని ఒక పాత్ర– జమదగ్నికి చాడీలు నూరిపోసి వుంటాడు... అనుమాన బీజాలు నాటి వుంటాడు– అంతేగాని, 'ఆహా' అని అనిపించే అత్యంత మానవ సహజగుణాన్ని తప్పుపట్టడానికి వాత్సాయనుడు చెప్పిన కామధర్మ శాస్త్రం అంగీకరించదు. అందాన్ని ఆస్వాదించేందుకు స్త్రీ పురుషులిద్దరికీ సమాన హక్కుంది.

పురుషుడు తొందరపడినంతగా స్త్రీ సాహసించి తొందరపడదు.

1) తన గుట్టు రట్టుకాకుండా వుంచగలిగేవాడు తారసపడితేనే ముందుకు వస్తుంది.
2) నిందపడ్తుందనే భయంతో ఆచితూచి వ్యవహరిస్తుంది.
3) పరాయి పురుషుడితో సంగమించాలనే కోరికవున్నా, ఆ మగవాడు ఎంతో ప్రయత్నిస్తే తప్ప లొంగదు.
4) మధ్యలో ధర్మమూ, శీలమూ, పాతివ్రత్యమూ వంటి మాటల ప్రభావం బాగా పనిచేసినప్పుడు ఆమె తన నిర్ణయాన్ని పూర్తిగా వాయిదా వేసుకోవచ్చు కూడా !

5) మానసికంగా, నచ్చిన పురుషుడితోసంగమాన్ని కోరుకోవడం అనేది కనిపించి కనిపించని దోషంగల శీలం. ఒకవేళ ఎప్పుడైనా, ఏ బలహీన క్షణంలోనైనా, అన్నీ అనుకూలించిన సమయంలో పరపురుషుడితో సంగమం జరిగినా కూడా అది కనిపించి కోపించని దోషంగల శీలమే ! ఎందుకంటే, అదే "రంధి"తో జీవించే వ్యక్తి కాదు కాబట్టి !

6) మగవాడి మనస్తత్వం వింతగా వుంటుంది.

"సిద్ధాయాంచ మాధ్యస్థ్యం గచ్ఛతి –" ఆమె తనంత తానుగా వలచివస్తే మరీ రెచ్చిపోకుండా మధ్యస్థంగా సంగమిస్తాడట.

"సులభాను మన్యతే" చాలా ప్రయత్నం చేస్తేగాని సాధ్యం కాదనుకున్న స్త్రీ చాలా సులభంగా అంగీకరించి వచ్చేస్తే వెంటనే ఇదేదో పెద్ద ముదురు - వేశ్య - అనుకొని అవమానించి పంపేస్తాడు. కానీ, తను ఎంత ప్రయత్నించినా అందకుండా తిరిగే ఆడదానిమీద మాత్రం... "దుర్లభం ఆకాంక్షతే..." అమితంగా వ్యామోహం పెంచుకొని దేవదాసులా వెర్రెత్తి తిరుగుతాడు.

దేవదాసు మాత్రం చేసిందేమిటీ...

ఇద్దరం లేచిపోయి పెళ్ళిచేసుకుందాం అని అడిగితే, కొట్టి పంపించాడు. తనూ ఆమె ఇష్టపడి ఏకం అవుదామనుకొన్నప్పుడు పట్నం పారిపోతాడు. ఆమెకు పెళ్ళి జరిగిపోయి ఇంక దొరకదనుకున్నప్పుడు దేవదాసే అయిపోయాడు. మగాళ్ళలో వుండే అత్యంత సహజమైన నెగెటివ్ మనస్తత్వానికి ఈ దేవదాసు ఒక ప్రతీక.

అందుకే, ఆడవాళ్ళు పరాయి మగాళ్ళతో సంబంధాలు పెంచుకోడానికి పదే పదే సంకోచిస్తారు... !!

